# ఆల్బో-సాంగ్



## అన్ని వయసుల వారికి ఆదర్శక బలవర్ధకం

మీరు అన్నివిధాల ఆరోగ్యంగా వుండాలంటే మీకు ఆల్బో-సాంగ్ అవసరం. వృద్ధులకు యువకులకు కూడా పటిష్టమైన శరీరాన్ని ఆరోగ్యాన్ని పెంపొందించుటకు ప్రత్యేకమైన పదార్థాలు ఆల్బో-సాంగ్‌లో చేర్చబడ్డాయి. ఈ రోజు ప్రతి రోజూ కూడా ఆల్బో-సాంగ్ తీసుకోండి. సర్వదా మీరు ఆరోగ్యంగా వుంటారు.




**జె. అండ్ జె. డీషేన్**
హైదరాబాదు (దక్కన్).

---

# ఇవిగో మీ ట్రాన్సిస్టర్ రేడియోకు తగిన శక్తివంతమైన బ్యాటరీలు...

## ఎవరెడి 'ఎనర్జైజర్' బ్యాటరీలు ట్రాన్సిస్టర్ల కోసం ప్రత్యేకంగా తయారు చేయబడ్డాయి



ఎవరెడి 'ఎనర్జైజర్' ప్యాక్ బ్యాటరీలు :-

- బ్యాటరీలు కారి, మీ సెట్టు పాడవదు.
- అంతరాయం లేకుండా బాగా స్పష్టంగా వినిపించేలా చేస్తాయి.
- చాలాకాలం పని చేస్తాయి. ఖర్చు కలిసివస్తుంది.
- స్పెషల్ సాకెట్లున్నందున ప్లగ్గులు తలక్రిందులుగా పెట్టేందుకు వీలులేదు. రేడియోలోని ఎలక్ట్రికల్ సిస్టమ్ చెక్కుచెదరకుండా చేసిన లోపలి ఏర్పాటు.




ప్రతి ఒక్క ట్రాన్సిస్టర్ రేడియో, రికార్డ్ ప్లేయర్, రేడియోగ్రామ్‌లకు పనికొచ్చే ఎవరెడి 'ఎనర్జైజర్' ప్యాక్ బ్యాటరీ వుంది. మీ సెట్టుకు పనికొచ్చే దాన్ని యివ్వమని మీ డీలరు నడగండి.

దేశమంతటా కొరత లేకుండా లభిస్తున్నాయి



ఇవికూడా లభిస్తున్నాయి.
నం॥ 286 (9వో) రూ॥ 10.75, నం॥ 276-పి (9వో) రూ॥ 6.30, నం॥ 275 (6వో) రూ॥ 5 50, నం॥ 273 (6వో) రూ॥ 10.25
ధరలలో పన్నులు చేర్చబడలేదు.



యూనియన్ కార్బైడ్ ఇండియా లిమిటెడ్

UC 19

**వి జ య & కో.,**
విజయవాడ : గుంటూరు

ఆంధ్రదేశమంతటా

డిశంబరు

**14**

విడుదల

ఏ.వి.ఎమ్

ప్రొడక్షన్స్‌వారి

# అవే కళ్ళు

ఈస్ట్మన్ కలర్



కథ. దర్శకత్వం

నవయుగ. A.C. త్రిలోకచందర్ M.A.

AVM PRODUCTIONS

మాటలు P.V. నరసరాజు B.A.

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 15—12—'67
శ్రీప్లవంగనామ సం॥ మార్గశిర్షమాసం శుద్ధ చతుర్థి
సంపుటము: 60 సంచిక: 15

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు:
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

పోస్టు ద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 22 40 |
| 6 మాసముల చందా | 11.20 |
| 3 మాసముల చందా | 5.60 |

## విషయానుక్రమణిక

ముఖచిత్రం: నటి రాజశ్రీ
(ఫోటో: ప్రభాకర్)

# దేశంలో ప్రజాస్వామ్యం పునరుద్ధరణ పేరుతో కమ్యూనిస్టుల కుతంత్రాలు

# బెంగాల్, హర్యానాలలో గవర్నర్ల చర్య

ఒక పని అసలు కాకుండా వుండే దానికంటే ఆలస్యంగా అవడం చాలా మంచిది. బెంగాలు, హర్యానా రాష్ట్రాల్లో శ్రీమతి గాంధీ ప్రభుత్వం కృషి ఫలించింది! చట్టసమ్మతంగా హర్యానా లెజిస్లేచర్‌ని పైదొలగ జేశారు. పశ్చిమ బెంగాల్‌లో గవర్నర్ జోక్యంకలగజేసుకున్నారు. ముఖర్జీ మంత్రి వర్గాన్ని కాంగ్రెసు ప్రభుత్వం ఆక్రమించింది. హర్యానా పరిపాలనలో గవర్నరు కలగజేసుకోవడం గురించి హర్యానా మాజీ ముఖ్య మంత్రి కోర్టుకెక్కుతా నన్నారు. పశ్చిమ బెంగాల్‌లో కమ్యూనిస్టులు పట్టాన్ని చేతుల్లోకి తీసుకుని ఇష్టం వచ్చినట్టు ప్రవర్తిస్తామని బెదిరించారు. అరెస్టయిన బాబుజ్యోతిబాసు యుద్ధాన్ని ప్రకటించారు. అది ఇప్పుడిప్పుడే కార్యరూపం దాలుస్తూ వుంది. బెంగాల్ శాంతిభద్రతల్ని తిరిగి నెలకొల్పడానికి కాల్పులు కొనసాగించక తప్పదు. అదే ఇప్పుడు జరుగుతున్నది!

'ప్రజాస్వామ్యం ఎప్పుడో వధించబడింది' అని కమ్యూనిస్టులు, వారి సోదరులు మొదటిసారిగా విజృంభించారు. బెంగాల్‌లో అస్తవ్యస్త పరిస్థితే ప్రజాస్వామ్యం అయి వుంటే — మాటలు అర్థాన్నయినా పోగొట్టుకుని వుండాలి. లేదా, మనుషులు కార్యకారణ జ్ఞానాన్నయినా పోగొట్టుకుని వుండాలి! ఒకసారి మాజీ ముఖ్యమంత్రి ముఖర్జీ అన్నారు: ప్రజల వల్ల తనకి ఏ ఇబ్బందీ లేదనీ, ఉన్న ఇబ్బందంతా తన తోటిమంత్రుల తోనే నని. సిసలైన ప్రజాస్వామ్యానికి అగ్రం 'ఘెరావ్'లు!

## పశ్చిమ బెంగాల్‌లో ఘెరావ్‌ల కథ

పర్యవేక్షణ సాగించేవాళ్ళు, లేదా దానికి సమానమైన పనివాళ్ళు తరచు 'ఘెరావ్'లలో ఇరుక్కుపోతున్నారు. వాళ్ళని అన్నాహారాలు కూడా ముట్టనివ్వడం లేదు. అన్యాయ ప్రవర్తనుల జోలికి పోవద్దని ముఖర్జీ ప్రభుత్వం పోలీసులకి ఆజ్ఞాపించింది! ఈ అవకాశాన్ని వినియోగించుకుని ఏప్రిల్ ఒకటవ తారీఖునుంచి అక్టోబరు ముప్ఫయ్యొకటి వరకు పశ్చిమ బెంగాల్‌లో 841 ఘెరావ్‌లు సుమారుగా లెక్కకు తేలుతున్నాయి ఈ కమ్యూనిస్టు చర్యలవల్ల వ్యాపారం, పారిశ్రామిక ఉత్పత్తి స్తంభించిపోయింది బెంగాల్ అవతలకి రాజధాని తరలిపోతూవుంది!

వెస్ట్రాహా స్మారకోపన్యాసం చేయడానికి ప్రొఫెసర్ బ్లాకెట్ కొన్ని వారాల్కితం ఇక్కడికి వచ్చారు. కమ్యూనిస్టులు, కార్మిక నాయకులు ఆ వుపన్యాసాన్ని అంతగా ఇష్టపడరుగాని, ప్రొఫెసర్‌గారు చెప్పిన విషయాలు చాల యదార్థమైనవి. కాపిటలిస్టు రంగంలో గాని, కమ్యూనిస్టు రంగంలోగాని అసలు పంచుకోడానికంటూ ఏమైనావుంటే పంపకమంటూ వుంటుందని ఆయన అన్నారు. పంచుకోడానికి ఎంతో కొంత వుండాలిగా? అందుకు సంపాదన అవసరం. ఆర్జించిన తరువాతనే పంచుకోవడం అనే ప్రస్తావన. ఈ సంపాదన — గట్టిగా పనిచేయడంవల్ల, సామర్థ్యంగా పనిచేయడంవల్ల ఆధారపడి వుంటుందిగాని 'ఘెరావ్'లవల్ల, గొడవం వల్ల ఏమీకాదు, అని ఆయన నొక్కి చెప్పారు.

## కమ్యూనిస్టులు కోరేదేమిటి?

కమ్యూనిస్టులు గట్టిగా పని చేయడం కంటె, గొడవల్ని ఎందుకు ఎక్కువగా ప్రేమిస్తారో ప్రొఫెసర్ బ్లాకెట్‌కి తెలుసు. అధికారాన్ని హస్తగతం చేసుకోడానికి కమ్యూనిస్టులు అవలంబించే విధానాల్లో ఈ పద్ధతి మొదటిది! ఇప్పుడు చైనాలో కనిపిస్తున్న విధంగా ఈ దౌర్జన్యాలవల్ల, అనిశ్చలపరిస్థితివల్ల ప్రజలు ఎక్కువగా కష్టపడి పని చేయాల్సివస్తుంది. రష్యాలోగాని, చైనాలోగాని వేతన సంఘాలు, కార్మిక సంఘాలు అంటూ ఏవిదా లేవు. భారతదేశంలో ఆర్థిక పరిస్థితి సమ్మిశ్రమం. ఇక్కడ, పనివాడి కోరికల ననుసరించి జీతాన్ని పరిచేయమని కమ్యూనిస్టులు పట్టుపడుతూ వుంటారు. రష్యాలో అలా కాదు. పనివాడి పనినిబట్టి జీతాన్ని స్థిరపరుస్తారు కమ్యూనిస్టుల దృష్టిలో భారతప్రభుత్వం కేవలం పనివాళ్ళ వల్లనే ఏర్పడింది. అది పనివాళ్ళకోసమే పాటుపడా లని వారి అభిలాష. చైనాలో కమ్యూనిస్టులు అధికారానికి వచ్చిన తర్వాత ఆ దేశం పతనమైపోయింది. అలా నేభారత దేశాన్ని తయారుచేయాలని కమ్యూనిస్టుల కోరిక. కోట్లకొలదీ ప్రజల తరఫున మాట్లాడుతున్నామనుకునే వారిలో అగ్రగణ్యులు క్రిష్ణమీనన్, కేశవ్‌మాలవీయ గారలు. క్రిష్ణమీనన్ రక్షణమంత్రిగా ఉండగా ఆయనకొక నివాసాన్ని ఇచ్చారు. ఇప్పుడాయన్ని ఖాళీచేయమన్నారు. వాసాలు లెక్కించిన ఆయన 'చేయను' అన్నారు.

పార్లమెంటులో సభ్యుడు కాకపోయినా అక్కడే కాపురముండాలని సంకల్పించుకున్నారు!

## ఓటుచేసినవాడి అవస్థ!

కమ్యూనిస్టుల వల్ల, వారితో సహకరించే వారివల్ల బెంగాల్‌లో ప్రజలు ఎలా బాధపడుతున్నారో చెప్పడానికి ఇదొక ఉదాహరణ రోడ్డు మీద ఒక మనిషి — అతని కోసం అతని పిల్లల కోసం రెండు భోజనాలతో సంతృప్తి పడతాడు. పిల్లల్ని పెంచి విద్యాబుద్ధులు గరపడానికి, బ్రతకడానికి సరిపోయే ఆర్జన కోసమూ అతను శాంతిని కోరుకుంటాడు. అతని జీవితాన్ని సుగమం చేయగల ప్రభుత్వాన్ని అతను సమర్థిస్తాడు అతను కాంగ్రెసుకు వ్యతిరేకంగా వోటు వేశాడూ అంటే — 1947 నుంచి కాంగ్రెసు చేసిన దానికంటే మేము నీకు ఎక్కువ మేలు చేస్తామని ప్రతిపక్షాలు అతనికి నచ్చచెప్పి వుండాలి అతను నమ్మాడు రాజకీయ వ్యక్తులు, ముఖ్యంగా శాసన సభ్యులు చెప్పే మాటలన్నీ నీళ్ళ మూటలని ఇప్పుడతనికి బాగా అర్థమై వుంటుంది. హర్యానాలో, ముఖ్యంగా అక్కడి పార్లమెంటు ప్రజాస్వామ్యం ఏ బాగా డబ్బున్న వాడికయినా సరే అమ్ముడు పోడానికి సిద్ధంగా వుంది! ఒక రాజకీయ పక్షంలో నుంచి మరో రాజకీయ పక్షంలోకి నడవడానికి మనుషులు సిగ్గును విడిచి పెట్టేశారు!

భారతదేశం, అంతకంటె ఎక్కువగా కాంగ్రెసుపార్టీ సరయిన నాయకత్వం లేక చిన్నాభిన్నమై పోతూవుంది. బెంగాల్‌లో కూడా సరయిన నాయకత్వం లేకనే అలా కష్టాలతక్కెడలా తయారయింది.

ఒకసారి ఒక నాయకుడు చచ్చిపోయాడు. అతని స్థానంలో నిలబడడానికి ఎవరూ లేక పోయారు. కార్యాలయంలో పని ఎంత విముఖంగా వుంటుందో? మంత్రులుగా నిల ద్రొక్కుకోవడం ఎంత కష్టమో? కార్యాలయాలవల్ల ఎంత లాభాన్ని పొందవచ్చునో? అందరికీ అర్థమై పోయింది. ఇది కాంగ్రెసులోనే కాకుండా క్రితం సార్వత్రిక ఎన్నికల తర్వాత అధికారాన్ని రుచి చూసిన వారికి కూడా బాగా అవగతమయింది.

## గవర్నర్ల సమావేశం పండగ!

న్యూఢిల్లీలో కొన్ని వారాల క్రితం 'గవర్నర్ల సమావేశం' అనే పెద్ద పండగ జరిగింది రాష్ట్ర గవర్నర్ల అధికారాలని చర్చించే చర్చా వేదికగా అది తయారయింది. ఇదే చర్చావేదిక లోక్ సభలో కూడా ప్రత్యక్షమయింది. అన్ని చర్చా సమావేశాల్లోలాగానే ఉపన్యాసకు లందరూ ఒక అభిప్రాయానికి రాని తలాతోకా లేని ఉపన్యాసాలు చేశారు

భారత రాజ్యాంగ విధానం గవర్నరు పదవికి కొంత అర్థం కల్పించి వున్నది చట్టం అతని స్థానాన్ని ఈ విధంగా నిలబెట్టింది:

గవర్నరు ఒక పనిని స్వతంత్రంగా స్థానికుని నిర్వహించవలసినంత అగత్యం ఏర్పడినప్పుడు తప్పితే, ముఖ్యమంత్రి నాయకుడుగా వున్న మంత్రివర్గం సలహాను తీసుకోవాలి. గవర్నరుకి మంత్రివర్గానికి మధ్య అభిప్రాయభేదాలు వచ్చినట్టయితే అప్పుడు గవర్నరు ఉభయపక్షాల శ్రేయస్సు దృష్ట్యా ఒక తీర్మానానికి రావొచ్చు. గవర్నరు అభిప్రాయమే నిలిచి వుంటుంది. గవర్నరు ఒక అభిప్రాయానికి వచ్చిన తర్వాత, అది కార్యరూపాన్ని ధరించిన తర్వాత, అతను అలా చేసి వుండాల్సింది కాదు అనే ప్రశ్నకి విలువ వుండదు. గవర్నరుయొక్క స్వతంత్రాభిప్రాయం పనికి రాదనడానికి ఎవరికీ హక్కు లేదు. మంత్రివర్గం సలహా యిచ్చినప్పుడు, దానిని గవర్నరు కొట్టివేసినప్పుడు. మంత్రివర్గం కోర్టుకెక్కి పరిశీలించమనడానికి కూడా వీలులేదు. ఇది రాజ్యాంగం చెప్పిన దాని సారాంశం.

## గవర్నరుకీలుబొమ్మా? రబ్బరుస్టాంపా?

గవర్నరు ముఖ్యమంత్రిని నియమిస్తాడు. మంత్రివర్గమంతాకలిసి గవర్నరు సంతృప్తి మేరకు పరిపాలన సాగిస్తూ వుంటారు.

యమ్ వి పైలీగారనే రాజ్యాంగ పండితుడు భారత రాజ్యాంగాన్ని గురించి రాస్తూ దాని వైఖరిని ఇలా క్రోడీకరించారు.

'రాజ్యాంగం ఏర్పరచిన అవకాశాల్ని పరిశీలించి చూసినట్టయితే, గవర్నరు కీలుబొమ్మ కాదని, ఒక 'రబ్బరు స్టాంపు' కాదని, రాష్ట్రముయొక్క మంచి చెడ్డలగురించి ఆలోచించు ప్రభుత్వంలో ప్రధానపాత్ర వహించే ఒక ప్రముఖ వ్యక్తి అని కనిపిస్తుంది.

'గవర్నరు ఏయే సందర్భాలలో స్వతంత్రంగా వ్యవహరించవలసి వుంటుందో ఈ క్రింది వివరాలు తెలియపరుస్తాయి: 1. మంత్రివర్గం ఏర్పడకముందు ముఖ్యమంత్రి ఎన్నిక 2 మంత్రివర్గాన్ని రద్దుచేయుడం. 3 శాసనసభని నిర్మూలించడం 4. శాసనసభ, పరిపాలనల విషయంలో ముఖ్యమంత్రిని వివరాలు కోరడం 5 ఒక మంత్రి అభిప్రాయాన్ని మంత్రివర్గం ముందువుంచి దానిని చర్చించమని ముఖ్యమంత్రికి ఆదేశించడం. 6 శాసనసభలో ఆమోదించిన బిల్లును తిరస్కరించి మళ్ళీ చర్చించమని కోరడం 7 కొన్ని సందర్భాలలో రాష్ట్ర శాసనసభ ఆమోదించిన బిల్లును రాష్ట్రపతి అనుమతికై సమర్పించడం. 8 అత్యవసర పరిస్థితిని ప్రకటించమని రాష్ట్రపతిని కోరడం.'

## కేంద్రప్రభుత్వం కర్తవ్యం?

ఈ విషయాలు అందరికీ తెలిసినవే. మన దేశంలో ఈ విధంగా అమలు జరుగుతున్నది కూడా. ఉదాహరణకి, పశ్చిమ బెంగాల్ గవర్నరు అక్కడి చట్టవిరుద్ధమైన కార్యకలాపాలకి సంతోషించి సంతృప్తి పడినట్టయితే, లేదా ముఖ్యమంత్రి సహమంత్రుల విశ్వాసాన్ని పోగొట్టుకున్నట్టు తెలుసుకునివుంటే; ఆయన అక్కడ రాష్ట్ర పరిపాలన సాగించమనిగాని, మంత్రివర్గాన్ని రద్దు చేయుమనిగాని రాష్ట్రపతిని కోరి వుండేవారు. రాజ్యాంగం చెప్పినట్టు వినాలంటే అలాగే చేయాలి.

పశ్చిమ బెంగాల్ గవర్నరు అచ్చరాలా అలాగే చేశారు. వచ్చే కొద్ది వారాల్లో కేంద్ర ప్రభుత్వం ఎంత పటిష్టంగా వున్నదో తేలి పోతుంది పశ్చిమ బెంగాల్‌లో అన్యాయ పరిపాలనని ఎదుర్కొన్న గవర్నరుకి కేంద్రం ఎటువంటి మద్దతు నిస్తుందో వేచి చూద్దాం!

# మూన్‌రేకర్-11 జేమ్స్‌బాండ్ బొమ్మల సీరియల్










—పాపం, మిల్‌డ్రెడ్‌కి ఒంట్లో బాగా లేదు, ప్రయాణం ఏమి చేస్తుంది...

[దారినపోయేవారు తెలివితప్పిన గాలాని డ్రాక్స్ కారులో నుంచి దింపటం చూశారు..]

[తెలివి వచ్చేసరికి గాలా సర్ హ్యూగో లండన్ ఇంట్లో బందీగా ఉంది..]

[హేమార్కెట్ దగ్గర భోజనానికి వస్తుందని ఆమెకోసం కాచుకుని కూచుని ఉన్నాను నేను..]










(—గాలా రావలసిన వేళ దాటి అరగంట అయింది...)

—టెలిఫోన్ సార్...

—ఎవరు బాండేనా? విను నా అమ్మాయి గాలా మాయమైపోయింది, సర్ హ్యూగోతో బయలుదేరిన తర్వాత. మూన్‌రేకర్‌ని వేసేది రేపే! ఎలాగయినా ఆమెని వెతికి పట్టాలి--

సర్ హ్యూగో, ఇదిగో వస్తున్నాను!










గాలా వేటలో సర్ హ్యూగో క్లబ్‌కి వెళ్ళాను— అప్పుడే బయటికి వెడుతున్నాడు.

సర్ హ్యూగో కారు అతని ఇంటి బయట ఆగింది—చిటికలో గాలాని తీసుకువచ్చి వెనక [illegible]

(—ఇలా బందీ కావటానికి గాలా కనుక్కున్న రహస్యం ఏమిటి?..)







(నా బెంట్లీని సర్ హ్యూగో మెర్సిడెస్ వెంట పోనిచ్చాను...)

[ ఆ కారులో గాలా కట్లతో పెనుగులాడుతోంది, ఫలితం లేకుండా..]

(ఇప్పుడు తెలిసింది సర్ హ్యూగో రహస్యం. అతన్ని ఆపే అవకాశం నాకు లేదు.)







[(డ్రాక్స్) లండన్ ఇంట్లో తెలివితప్పినట్లు నటిస్తున్నప్పుడు గాలాకి అంతా అర్థం అయింది.]

(.. ఆ యంత్రం.. ఆ లెక్కలు... మూన్‌రేకర్‌ని లండన్‌మీద పడేస్తారు!...)

(...దానికి అణ్వస్త్రం తగిలించి ఉంటుంది!)










[(క్రెబ్) చిత్రహింసతో గాలాకి తెలివి తప్పింది. కాని, మూన్‌రేకర్‌తో లండన్‌ని నాశనం చెయ్యాలనుకున్న (డ్రాక్స్) పథకం గురించి ఆమెకి ఎంత తెలుసో కనుక్కోలేకపోయాడు.]

[(డ్రాక్స్) కారు వెనుకసీటులో ఆమెకి తెలివి వచ్చింది]

—ఎవరో మనని వెన్నాడుతున్నారు కాపిటాన్!
—అది బాండ్ కారు!

(ఇంకా ఉంది)

# సైంటిస్టులు

## నొప్పిని అతి శీఘ్రంగా తొలగించునట్టి విధానమును

# కనుగొన్నారు




# మైక్రోఫైనెడ్ 'ఆస్ప్రో'

ఇప్పుడు, మొదటిసారిగా భారతదేశంలో ప్రవేశపెట్టబడినది

**బాధ మా సమస్య :** "ఆస్ప్రో" యొక్క పరిశోధన సంస్థలో, బాధ యొక్క సమస్య మీద పని చేస్తున్న సైంటిస్టులు ఇప్పుడు, క్రొత్త మైక్రోఫైనెడ్ ఆస్ప్రోను కనుగొన్నారు — ఇది బాధను అతి శీఘ్రంగా పోగొట్టే సాధనము.

**మైక్రోఫైనెడ్ అంటే ఏమిటి?** మైక్రోఫైనెడ్ అంటే, ఆస్ప్రోలోని నొప్పిని పోగొట్టే పదార్థము మున్పటి రెట్లు సన్నగా క్రొత్త ప్రత్యేకమైన పద్ధతిలో చెయ్యబడినది. ప్రతి మాత్రలోను ఇప్పుడు ఇంచుమించు 15 కోట్ల అతి సూక్ష్మమైన అణువులు వుంటాయి. అందువలన, రెండింతల కన్నా ఎక్కువగా నొప్పిని పోగొట్టే శక్తి అతి శీఘ్రంగా పని చేసి, మూడు రెట్లు శీఘ్రంగా నొప్పిని తొలగించును.

**అతి శీఘ్రంగా పని చేస్తుంది-చాలా సేపు వుంటుంది :** క్రొత్త మైక్రోఫైనెడ్ ఆస్ప్రోలోని చురుకైన పదార్థము అనాయాసంగా, అతి త్వరగా ఇమిడి శరీరమందు 5 నుండి 7 గంటల దాకా వుంటుంది. ఇందువల్లనే, మైక్రోఫైనెడ్ ఆస్ప్రో అతి శీఘ్రంగా నొప్పిని తొలగిస్తుంది, మరియు చాలా సేపు వుంటుంది.

**తీసుకోవడం చాలా సులభము :** క్రొత్త మైక్రోఫైనెడ్ ఆస్ప్రోను మీకు ఇష్టమైనట్లు తీసుకోవచ్చును. అలాగే కాని, నీళ్లలో కలిపి కాని, ఒక గ్లాసుడు నీళ్లతో కాని, లేక వేడి పానీయముతో కాని తీసుకోవచ్చును.

**వీటికోసం క్రొత్త మైక్రోఫైనెడ్ 'ఆస్ప్రో'ను వాడండి :** నొప్పి, తల నొప్పి, ఒళ్లు నొప్పి, పంటి పోటు, కీళ్ల నొప్పి, జ్వరముతో కూడిన జలుబు, ఫ్లూ, కీళ్ల నొప్పులతో కూడిన జ్వరము, గొంతునొప్పి.

**మోతాదు :** పెద్దవారికి : రెండు బిళ్లలు, అవసరమైతే మళ్లీ వేసుకోండి. పిల్లలకు : ఒక బిళ్ల, లేక డాక్టర్ సలహా ప్రకారము వేసుకోవలెను.

**క్రొత్త మైక్రోఫైనెడ్ 'ఆస్ప్రో' ఈ విధంగా పనిచేస్తుంది**




బిళ్లలోని అణువు ఎంత పెద్దదిగా వుంటే అంత నెమ్మదిగాను అది ఇముడుతుంది— అందువల్ల మీకు, నొప్పి తగ్గడానికి చాలా సేపు ఆగాలి.




ఇది మైక్రోఫైనెడ్ చెయ్యబడుట వలన, ప్రతి క్రొత్త మైక్రోఫైనెడ్ ఆస్ప్రో బిళ్లలోను ఇంచుమించు 15 కోట్ల అతి సూక్ష్మమైన అణువులు వుంటాయి. అందువలన, ఇది అతి త్వరగా ఇముడి, అతి శీఘ్రంగా నివారణ నిచ్చును.

**క్రొత్త మైక్రోఫైనెడ్ 'ఆస్ప్రో', నొప్పిని, నివారించుటకు, ఇప్పుడు మీకు లభించే వాటిలో అతి ఆధునికమైన సాధనము.**









మైక్రోఫైనెడ్

**ఆస్ప్రో**

అతి శీఘ్రంగా నొప్పిని తొలగించును

నికోలస్ ఉత్పత్తి

జె. ఎల్. కె, హైదరాబాదు

పాపానికి ప్రాయశ్చిత్తం ఏమిటి?

పశ్చాత్తాపం

ఎస్. ఎస్. జె, నిజామాబాదు

పూర్వం మహారాజులు భార్యలుండగానే యింకా పెళ్ళిళ్ళు చేసుకునేవారు. కాని ఈ కాలంలో.

'పెళ్ళి చేసుకోవడం లేదంతే

ఈ ప్రపంచంలో అందమైన వస్తువేది?

మంచిమనసు

బి. వి, నాందేడు, (మహారాష్ట్ర)

కోపంలో అనుకున్న మాటలకు బాధపడేవాళ్ళు ఏం చేయాలండీ?

క్షమార్పణ అడగడానికి సిగ్గు పడకూడదు

ఎస్. ఆర్. బి, చేవూరు.

ఎంతో నమ్రతతో యిస్తున్న మీ జవాబులు చదువుతూ ఉంటే నా మనస్సు సంతోషంతో నిండిపోయింది.

కృతజ్ఞురాలను!

కె. సి. హెచ్. ఆర్, పాలకొండ.

అభ్యుదయ మానవ జీవితంలో ఏ విటమినూ తోసించి జీవించడం కష్టం అంటారు?

'ఎమ్' (మనీ!) విటమిను తప్పదుగా!

బి. ఎల్. ఎస్, భీమవరం

డాక్టరు, ఇంజనీరింగు కోర్సులలో ఏది మంచిది?

ఎందుకు? చూడడానికా? కట్నానికా? సేవకా? లేక చదువుకుందుకా?!




జి. వి. ఆర్, గూడూరు.

కాలేజీలో చదివే ఆడపిల్లలు వినయ విధేయతలుగా నడుచుకుంటే ఏ అబ్బాయీ వారినేమీ అనడు గదా? ఆ విషయం వాళ్ళు గ్రహించుకోరేం?

అక్కడికి అబ్బాయిలు వినయవిధేయతలుగా నడుచుకోనక్కరలేనట్టు చెప్పారేం!

కె. ఎమ్. ఆర్, మంథెన

బాటసారిలో మాధవిని, దేవదాసులో పార్వతిని, చరిత్రహీనులలో సావిత్రిని శరత్ బాబు అన్యాయం చేశాడు కదా? అతని ఉద్దేశ్యం ఏమిటి?

ఏం అన్యాయం చేయలేదు. పోగా మన రచయితలకి ఎన్నటికీ అందని నాలుగు పాత్రలిచ్చి పుణ్యం కట్టుకున్నాడు శరత్ బాబు!

ఎమ్. వి. ఆర్. వి. ఎల్, ఉరవకొండ

స్త్రీ నుంచి పురుషుడు, పురుషుని నుంచి స్త్రీ కోరే అమూల్యమైన వస్తువు ఏదండీ జీవితంలో?

అర్థం చేసుకోవడం.

పి. ఏ, పర్కాల్

నా హైస్కూలు విద్య పూర్తి అయిపోతుంది. నాకు పై చదువు చదవాలని. పరిస్థితులు అనుకూలించే సూచనలు లేవు. ఈ పరిస్థితిలో ఏం చేయాలి?

చేయడానికేముంది? ఏ ట్రైనింగో అవడం ఉద్యోగ ప్రయత్నం చేయడం. రెండు మూడేళ్ళు ఉద్యోగాలు చేసిన తరువాత చదువుకున్నవారెందరో తెలుసు నాకు. నిరుత్సాహం పనికి రాదు.

వి. వి. ఎస్, కరీంనగరు

ప్రకృతి కన్న అందమైనవాడు పురుషుడు. మీ వ్యాఖ్య.

ప్రకృతికన్న అందమైనవాడా పురుషుడు అహ!

టి. ఎస్. ఆర్, విశాఖపట్నం

నాకు అన్నీ తెలిసినట్టే ఉంటాయి. పరీక్షలో మార్కులు రావు.

అనుమానం లేనివాడవలేం ఎరుగనివాడవ్వాలని పెద్దలు.

పి. ఎస్. డి, విజయవాడ

మా యింట్లో నేను పెద్దదాన్ని. ఇంకా అయిదుగురు చెల్లెళ్ళు ఉన్నారు. అందరికీ కావలసినపని నన్నే చెయ్యమంటారు. నాకు బాధగా ఉంటుంది.

అందరికీ కావలసిన పని మీద ఎవరికీ శ్రద్ధ ఉండదని స్పానిష్ లోకోక్తి. పని జరగాలంటే ఎవరో ఒకరు చెయ్యాలిగ?

బి. ఎస్. కె, గూడూరు

నాకు ఇంగ్లీషు తెలుగులాగా ధారాళంగా మాట్లాడాలని ఉంది. ఏమి చదివితే మాట్లాడగలనంటారు?

చదవడం వల్ల సంభాషించడం రాదు. తప్పో ఒప్పో మాట్లాడేస్తూ ఉంటే అదే వస్తుంది.

పి. ఎ. ఎస్. పి. హైదరాబాదు

కథను చదివాక 'ఫలానా' నీతి తెలుసుకున్నాను అన్న తృప్తి పాఠకునికి కలగాలంటాను. మీరేమంటారు?

ఈసప్ నీతికథలు చదువుకోమంటాను.

కె. పి, కరీంనగరు

ఈ శీర్షికను నిర్వహించడంలో అసలు ఉద్దేశ్యం ఏమిటండీ?

సరదా.

# ప్రశ్నావళి

కె. జి. పి, హిందుపురం

స్త్రీకి విద్య అవసరం అంటారా? అనవసరం అంటారా?

స్త్రీ మనిషికాదా? మనిషికి విద్య అక్కరలేదా?!

ఎస్. ఎస్. డి, ఎర్రగొండపాలెం

ఈ కాలంలో ఆడపిల్లలకి ఉన్నత విద్య అవసరమా? అనవసరమా?

ఉన్నత విద్య అంటే ఎక్కడిదాకా అని మీ అభిప్రాయం? పెళ్ళికే అంటే మెట్రిక్‌దాకా చాలు. పెళ్ళితరువాత కూడా ఉద్యోగం చేయాలంటే డిగ్రీ కావాలి. డిగ్రీతో తృప్తిలేకుంటే . . పై చదువుకి ఎవరేనా వెళ్లవచ్చు. దానికి అడ్డముగా లేదా ఏముంది?

ఎస్. ఎస్. ఆర్. ఎస్, అనకాపల్లి

మానవ మనుగడ ఎంత వరకు?

కనుమూసేటంత వరకు.

స్త్రీకి జీవితంలో అత్యున్నత స్థానం ఏది?

ప్రేమించే ఆదరణ.

భార్యా భర్తల మధ్య బాంధవ్యం ఎంత వరకు?

అరిమరికలు లేనంత వరకు.

ప్రేమకు ప్రతిరూపం ఏమిటి?

ఉయ్యాలలో పాప!

కె. కె. ఆర్, అనకాపల్లి

దేశంలో నిరుద్యోగ సమస్య నిర్మూలించాలంటే ఏం చేయాలండీ?

అందరిచేతా ఉద్యోగాలు చేయించాలంతే.

కె. పి, కరీంనగరు

మీ దృష్టిలో సినలైన నాయకు లెవరండీ?

వినాయకుడొక్కడే సిసలైన నాయకుడు!

వై. ఎల్, కలిబేడు

మా పాపకి ఆరేళ్ళు. వెంకటేశ్వరస్వామి బొమ్మ చూసిన ప్రతిసారి కళ్ళేవి? అంటుంది. ఆ ప్రశ్న పాప మీకు వేస్తే మీ సమాధానం ఏమిటి?

ఏముంటుంది? ■ గంభీరమైన నామంకింద దాక్కున్నాయి పాపా అని చెప్పేదాన్ని

కె. ఎల్. ఎక్. ఆర్, చేవ్వూరు

స్త్రీ సంఘంలో ఉన్నత స్థానాన్ని పొందాలంటే ఏమి కృషి చేయవలెను?

చేస్తున్న పనినే చిత్తశుద్ధితో చేస్తే చాలు!

## కొత్త శీర్షిక ప్రారంభం

# నా అనుభవాలు



## రీటా ఫరియా

ప్రపంచసుందరి సింహాసనంమీద రీటాఫరియా

రీటా ఫరియా వంటి ప్రపంచసుందరి మరెవరూ లేదంటారు ఆమెకి కీర్తి వచ్చింది బాగా డబ్బూ వచ్చింది అంతేకాక, జీవితంలో ఎంతో ఉల్లాసకరమయిన అనుభవం దొరికింది.

రీటా ఒకప్పుడు ఎంతో బిడియం కల మెడికల్ స్టూడెంటు బిరుదు వచ్చిన తర్వాత పాశ్చాత్య పద్ధతుల నెన్నిటినో నేర్చుకుంది ఎన్నో 'నిజాలు' తెలుసుకుంది

మచ్చుకి—1 ఇంగ్లీషు వాళ్లందరూ పెద్ద మనుషులు కారు

2 వ్యాపారులు 'లెక్కలు' వేసినప్పుడు 'కొలతలు' గురించి కూడా ఆలోచిస్తారు !

నేను మిస్ వరల్డ్ కావటానికింకా 24 గంటలే ఉంది

లండన్‌లోకెల్లా గొప్ప హోటల్ అది

దాని ఎదుట అండర్‌వియర్‌లో మాత్రమే పరిగెత్తుతున్నాను నేను

అప్పటికి తెలియలేదుగాని ముందుముందు ఎందరో మగవాళ్లు నన్నలా తరుముతారు

రసికులా? ప్రపంచం అంతటా ఉన్నారు. అందరి పద్ధతులూ ఒకే రకం—అందరి ఉద్దేశమూ ఒకటే!

ఒకసారి హోటల్ పడకగదిలో పాతిలం కోసం పోరాడాను.

మరోకసారి ఒక రయిలు కంపార్టుమెంటులో తాగినవాడిని తప్పించుకుని పరిగెత్తాను...

పార్టీలలో ఒక 'సహాయం' చేస్తే బాగా డబ్బు కురిపిస్తామనేవారిని తప్పించుకున్నాను

ఒక కంపెనీ ప్రతినిధి 'అనధికార' మయిన షరతు పెట్టబోయినప్పుడు అతనితో యుద్ధం చేశాను

నేను ఇది రాసే సమయానికి నా 'పరిపాలన' ముగియలేదు!

కొందరంటారు—ఈ పోటీలో నెగ్గినప్పుడే ఇదంతా ఎదురు చూసేఉండాలి నువ్వు, అని అందమయిన ఆడది కవిపిస్తే వదిలే మొగవారెందరుంటారు

నిజమే

కాని, నాది భారతదేశం. అక్కడ కొని

మడను కనిపిస్తేనే తపనే వారు ఎందరున్నారో తెలుసా? ఇంత తృష్ణ చూపించే మగవారిని చూడటం నా కిదే మొదటిసారి

మా దేశంలో ఆడవారు లిప్‌స్టిక్ వేసుకొనటమే ఇష్టంలేదు ఎందరో మగవారికి— నేను ఒకప్పుడు పెళ్లి చేసుకుందామనుకున్న అబ్బాయికీ అంతే.

ఇక 'పొట్టి పావడ' లంటారా! సరే నేనిప్పుడు వేసుకుంటున్నాను కాని ఏడాది క్రితం వాటి జోలికి వెళ్ళగలిగేదానినా?

అందుకనే నన్ను ఒక రచయిత — 'కల్లోల ప్రపంచసుందరి', అన్నాడు.

మా ఇంటిదగ్గర ప్రతి 'అబ్బాయి-స్నేహితుడి'నీ అమ్మా నాన్నలు తనిఖీచేసి. నచ్చితేనే 'పాస్' చేస్తారు.

అటువంటి వాతావరణంలో పెరిగిన నేను ఆ రాత్రి హోటల్ బయట మగవాడి నొకడిని తప్పించుకుని పరిగెత్తినప్పుడు ముందు రాబోయే సంగతులని పసిగట్టి ఉండవచ్చు నేను!...

అసలు జరిగింది —

పోటీ రిహార్సల్‌లు లైసియం బాల్ రూమ్‌లో జరుగుతున్నాయి చీర మార్చుకుందామని పక్కనే ఉన్న వాల్డార్ఫ హోటల్‌కి వెళ్ళాను.

తలుపు చేరుకున్నాను.

లోపలికి వెళ్ళిపోతున్నాను.

చీర అంచు కాలికి చిక్కుకుంది. నేను పడ్డంత పని జరిగింది.

చీర ఊడిపోయింది.

బాంబు పడినట్లే...

అది లండన్‌లో రద్దీగాఉన్న వీధి...

నడిచేవాళ్ళు ఆగిపోయి నోళ్ళు వెళ్ళబెట్టి చూస్తూ ఉండిపోయారు...

ఆశ్చర్యంలేదు ఎందుకంటే, నడివీధిలో నురచున్న నేను లంగా, బాడీతో మాత్రమే ఉండిపోయాను!

ఇంతలో ఎవరో రసికుడు రంకె వేశాడు పడిపోయిన చీర పట్టుకుని పరిగెత్తాను.

ఎలాగో గది చేరుకున్నాను!

ఇదే నేను పోటీ నెగ్గిన తర్వాత జరిగి ఉంటే? ఎంత గొడవ జరిగేది?!

ఆల్బ్రిచ్‌లో నగ్నంగా మిస్ వరల్డ్ అనేవారు...

ఒక కథ చెప్తాను.

ఒక కంపెనీ బ్రాసియెర్ ప్రకటనల విషయమయి కాంట్రాక్టు సంతకం పెడదామనుకున్నాను.

కాని, ప్రకటనలలో సగం నగ్నంగా ఫొటోగా కనిపించటం ఎలా?

బహిరంగంగా ఈత సూటు వేసుకొనటమే ఇష్టంలేదే నాకు!

అర్ధంతా ఫరవాలేదన్నాడు కంపెనీ ప్రతినిధి.

చీర, బ్రాసీయేర్ రెండూ వేసుకుంటే సరి, అన్నాడు.

'అసలు మీ పేరు ముఖ్యం!' అన్నాడు. 'పోనీ అంతగా అయితే ఆలోచించి రేపు చెప్పండి!'

మర్నాడు టెలిఫోన్ చేశాడు బాగా ఆలోచించినట్లున్నాడు – దేనినిగురించో?

'ప్రకటనకి పోస్ చేస్తారా?'

'తప్పకుండా!'

'వచ్చి వివరాలన్నీ మాట్లాడుతాను...'

వచ్చిన చిక్కు...

'ఒక్కటే ఒకటి,' అన్నాడు.

'మీరు చీరకింద బ్రాసియేర్ వేసుకుంటే మా కంపెనీకి అభ్యంతరం లేదు – కాని, చీర లేకుండా వట్టి బ్రాసియెర్‌లో చూడాలని ఉంది నాకు ఫొటో తీసేముందు'

'ఇదంతా వ్యాపారదృష్ట్యా మాత్రమే! నా వృత్తే అంత...'

అవును, అంతే.

ఫోను పెట్టేశాను.



'ఒక రచయిత నన్ను "కల్లోల ప్రపంచసుందరి" అన్నాడు.'

# రచయితలకు మనవి

### కథలు, వ్యాసాలు

ప్రచురణకి స్వీకరించబడని తమ వ్రాత ప్రతులని తిప్పిపంపగోరే రచయితలు వ్రాత ప్రతులతోబాటే తగుమాత్రం తపాలాబిళ్లలు అతికించిన, స్వంత చిరునామాకల కవరు కూడా పంపాలి. స్టాంపులు మాత్రం పంపరాదు. స్టాంపులు మాత్రం పంపించినట్లయితే వ్రాతప్రతులు తిప్పిపంపబడవు వ్రాత ప్రతులతో పాటు స్వంత చిరునామా, తగుమాత్రం పోస్టేజికి కవర్లు పంపినా వ్రాతప్రతులు తిప్పిపంపబడవు.

ప్రచురణకి స్వీకరించబడిన వ్రాతప్రతుల విషయంలో నెలలోపల ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.

### నవలలు

ప్రచురణకి స్వీకరించబడని నవలల వ్రాత ప్రతులు మేమే తిప్పి పంపిస్తాము. వ్రాత ప్రతులతో స్వంత చిరునామాకల, తగు మాత్రం పోస్టేజి అతికించిన కవర్లు పంప నవసరం లేదు. 100 అరఠావు పేజీల పయిన ఉన్న వ్రాతప్రతులే నవలలకింద పరిగణింపబడతాయి.

### కార్టూన్లు

ప్రచురణకి స్వీకరింపబడని కార్టూన్లు తిప్పి పంపగోరేవారు కార్టూన్లతో స్వంత చిరునామాకల, తగుమాత్రం పోస్టేజి అతికించిన కవర్లు జతపరచి పంపాలి స్టాంపులు మాత్రం పంపరాదు.

**షరా:** వ్రాతప్రతులనీ, కార్టూన్లనీ వీలయినంత భద్రంగా తిప్పిపంపే ప్రయత్నాలు చేస్తాము కాని, వాటి విషయమయి ఎటువంటి బాధ్యతనీ స్వీకరించలేము ఈ షరతుని గమనించి, రచయితలు తమ రచనలు, కార్టూన్లు పంపగలరు.

సంపాదకుడు

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

# నా అనుభవాలు

పాపం మళ్లీ టెలిఫోన్ చెయ్యలేదు.

కొందరలాకాదు పట్టుకుంటే వదలరు ఒక వ్యాపారస్థుడిని ఎక్కడో కలిశాను మళ్లీ అతన్నే కలిశాను. భోజనానికి తీసుకు వెళ్లాడు. అయిన తర్వాత నా హోటల్లో దింపేస్తానన్నాడు.

'సరిగ్గా మీ గదిముందు దింపేస్తాను మీవంటి అప్సరసకి సరయిన గుడ్ నయిట యినా చెప్పకపోతే ఎలా ?' అన్నాడు హోటలు బయట

పెద్ద మనిషే, అనుకున్నాను.

గదిదాకా వెళ్లాము.

'లోపలికి వస్తా' నన్నాడు.

'అక్కర్లేదు' అన్నాను.

మరయితే ఎలా? — అన్నాడు అతను. రాత్రంతా ఇక్కడే ఉండిపోతా నన్నాడు.

హడలిపోయాను.

కాని ధీమాగానే, 'క్షమించండి! వీల్లేదు!' అనేశాను! 'మర్యాదగా వెళ్లక పోతే హోటలు మేనేజర్ని పిలుస్తాను...' నిర్లక్ష్యంగా చూశాడు.

'పోలీసుని కేకేస్తాను!' అన్నాను.

'పోలీసునేనా ? అలాగే పిలు! వారిని కొనేస్తా...' ఇంతలో నన్ను పట్టుకో బోయాడు. ముద్దుపెట్టుకోబోయాడు. మంచంవయిపు నెట్టబోయాడు.

నేను అరిచి ఉండాలి కాని, ఇంకా రెచ్చిపోతాడేమోనని ఆ పని చెయ్యలేదు. తప్పించుకుని గది మూలకి పరిగెత్తాను అక్కడి నుంచి నా సంగతంతా చెప్పుకున్నాను.. మా అమ్మ...నన్ను పెళ్లిచేసుకోబోయే లాయరు డేవిడ్ గార్డ్నర్.. అతను త్వరలో వచ్చేస్తాడు... అతనికంతా చెప్పేస్తాను...

ఏమనుకున్నాడో గార్డ్నర్ పేరు వినగానే కిక్కురుమనకుండా వెళ్లిపోయాడు.

నాకు ఆ రాత్రంతా నిద్దర లేదు. తలుపు గడియ వేశాను.

ఇదంతా డేవిడ్ గార్డ్నర్‌కి చెప్పలేదు.

నన్ను వివస్త్ర చెయ్యడమే ఎందరికో ధ్యేయం అనిపించింది.

(ఇంకా ఉంది)

# డాక్టర్ కబుర్లు

## కొత్త పిండి ఆహారం

హవాయి ద్వీపాలలో చామదుంప, కందగడ్డలని పోలిన వాటినిరుబ్బి' పిండితో చేసిన వంటకాలని తింటారు.

ఇవి మామూలు ధాన్యాలతో-గోధుమ, జొన్న, బార్లీ, బియ్యం వగైరాలతో- చేసిన వంటకాలు పడనివారికి బాగా పనిచేస్తా యని డాక్టర్లు అంటున్నారు. కడుపులో ఏవిధమయిన బాధ కలిగినా ఈ దుంపల పిండితో చేసిన వంటకాలనే తింటే మంచి పథ్యంగాఉంటుందిట. ఈ ఆహారంలో ఎంటయిమిన్లు, ధాతువులు అధికం.

హవాయిలో వీటిని నూరి ఏమేమో చేస్తారు. అవసరాన్ని పట్టి పిండి విధాన్ని మార్చుకోవచ్చు.



2.

హెచ్. ఎల్. హెర్క్సన్‌సోన్

(కాపీరయిటు)




వాడుటకు సూచనలు: విక్స్ వేపొరబ్‌ను వాడు పడుకోబోయేముందు రుద్దండి

| | | |
|---|---|---|
| దానిని వాని ముక్కుమీద, రెండు వైపులా రుద్దండి | ...వాని గొంతుక మీద, ఛాతీమీద రుద్దండి | ...వాని వీపు అంతటి మీద రుద్దండి. కంబళి కప్పి పడుకోబెట్టండి |

"జలుబును పోగొట్టుటకు మీరూ విక్స్ వేపొరబ్‌ను నమ్ముకోండి"

# మహాజర్ ఎవరు రాశారు?

ఇక్కడి అల్లర్లతోబాటు విద్యార్థుల అల్లర్లని గురించిన వార్తలు కూడా పత్రికలలో వస్తూనే ఉన్నాయి. వంద సంవత్సరాల క్రితం జరిగిన ఒక 'విద్యార్థుల అల్లరి' కథని గురించి ఈ క్రింద చదవవచ్చు!

1849 లో పూనా నగరవాసులు కొందరు ఒక విచిత్ర సంఘటనని చూడగలిగారు. విశ్రాం బాగ్వాదా సంస్కృత కళాశాలలోనుంచి ఇద్దరు మధ్య వయస్కులయిన బ్రాహ్మణులు పరిగెత్తుకుంటూ వచ్చారు. వారి తలపాగాలు ఊడి వారి వెనుక వేళ్ళాడుతున్నాయి. కాళ్ళకి చెప్పులు లేవు. అవి అంతకిముందే పడిపోయాయి. తరిమి తరుముతూ వారివెంట కొందరు విద్యార్థులు పరిగెత్తుకు వచ్చారు.

'మరి మీరు సంస్కర్తలా! ఆ దక్షిణ మహాజరు అభ్యర్థన మా కివ్వండి! లేదా మీ తలలు పగుల్తాయి!' అని అరుస్తున్నారు. కాని, ఈ మధ్య వయస్కులు ఇద్దరూ అతి చాకచక్యంగా వారిని తప్పించుకుని పారిపోయారు...

ఈ తమాషాని చూడటానికని పెద్ద గుంపు ఒకటి గుమిగూడింది. ఇదంతా ఏమిటో తెలుసుకొనటానికి కొందరు విద్యార్థి బృందం చుట్టూ మూగారు. వారు చెప్పింది విని తామూ ఆ 'సంస్కర్త'లని తిట్టటం మొదలు పెట్టారు.

హైందవమత విరోధాన్ని ఈ విధంగానే తెల్లవారు కూడా ప్రోత్సహిస్తున్నారని వారినీ తిట్టారు.

1674లో ఛత్రపతి శివాజీ ప్రతి శ్రావణమాసం బ్రాహ్మణులకి దక్షిణ పంచిపెట్టే పద్ధతి ఒకదానిని ప్రారంభించాడు. ఒక్కొక్క బ్రాహ్మణుడికీ అతని పాండిత్యానికి సరిపోయినంత విలువగల నాణెం ఇప్పించేవాడు. పాండిత్య పరీక్ష శివాజీ మంత్రులలో ఒకరయిన పండితరావు జరిపేవాడు. ఈ అలవాటు శివాజీ కొడుకుల ద్వారా రెండవ బాజీరావు పీష్వాదాకా నిలిచిపోయింది. చివరికి ఈ దక్షిణ వ్యసనం పాండిత్య విచక్షణ లేకుండా బ్రాహ్మణులకి ఇచ్చే దానం అయిపోయింది. పీష్వాల పరిపాలన ముగిసింది కాని, బ్రిటిషు పరిపాలకులు ఈ పాత అలవాటుని ఆపలేదు. ఎలిఫెన్‌స్టన్ ప్రభువు దీనికని రు.50,000 కేటాయించాడు. ఈ దక్షిణల కోసం భారతదేశంలోని నలుదిక్కుల నుంచీ బ్రాహ్మణులు పోగయ్యేవారు.

పూనాలో హిందూకాలేజిలో బ్రాహ్మణు లని మాత్రమే చేర్చుకునేవారు అందుకని ఈ కాలేజి కోసం 20,000 రూపాయలు దక్షిణ మొత్తంలో నుంచి తీసేవారు.

ఈ పద్ధతులని లోకహితవాది గోపాలరావు దేశ్‌ముఖ్ అనే పేరుపొందిన సంఘ సంస్కర్త ప్రతిఘటించాడు. అర్థం తెలియకుండా శ్లోకాలు వల్లించేవారికోసం ఇంత ధనవ్యయం చెయ్యటం దండగ అన్నాడు. కొందరు మిత్రులతో సంప్రదించి దక్షిణ మొత్తంలో 3000 రూ. ఉత్తమమయిన మరాటీ పుస్తకాలకోసం వినియోగించాలనే అభ్యర్థన మహాజరుద్వారా అధికారులకి అందచేయించాడు. ఈ మహాజరులో ఎందరో ఉపాధ్యాయులు సంతకాలు పెట్టారు. సంతకాలు పుచ్చుకొనేవారు ఇద్దరు విశ్రామ్ బాగ్ కళాశాలకి కూడా వెళ్ళారు— వీరి పేర్లు శ్రీయుతులు చిప్లుంకర్, భవాల్కర్. కొందరు విద్యార్థులు చూసుకోకుండా సంతకాలు పెట్టారు కాని అసలు విషయం బయటపడేసరికి ఆ మహాజరునే నాశనం చెయ్యాలనుకున్నారు. 'అభ్యర్థనని ఇచ్చెయ్యండి!' అని గదమాయించారు. ఇది పెద్ద గొడవ అయిపోయి వచ్చిన అభ్యర్థులు ఇద్దరూ పారిపోవలసి వచ్చింది.

ఇది జరిగిన అచిరకాలంలోనే దానిని ప్రభుత్వానికి అందచేశారు అందులో 39 మంది సంతకాలు పెట్టారు వీరిలో ఎక్కువ మంది బ్రాహ్మణులే. ఇది సంస్కరణని ఎదిరించేవారికి అసలే నచ్చలేదు. ఎందరో కూడబలుక్కుని వీరిని బెదిరించటం ప్రారంభించారు. ఏడుగురి మీద దావాలు కూడా వేశారు. (వచ్చి పూనా నగరంలో వారు ఏర్పరచిన ఒక బ్రాహ్మణ సభలో క్షమార్పణ కోసం వేడుకోవాలన్నారు.)

చిప్లుంకర్, భవాల్కర్‌లకి విద్యార్థుల ధోరణి చూసి భయం వేసింది. జోతిబా



ఫూలె వద్దకువెళ్లి ఆ విషయం గురించి చెప్పుకున్నారు. జోతిబాఫూలె అప్పటి కాలంలో దండ—పట్టా (కత్తి) సాము నేర్పించేవాడు—అవసరమయినవారికి. దీనిని లాహూజీ బువా అనే హరిజనుడు ఒకతను నేర్పేవాడు. అతనికి పెద్ద ముఠా ఒకటి ఉండేది. చిప్లుంకర్, భవాల్కర్ల సంగతి వినగానే వారి రక్షణకోసం రెండు వందల మందిని సిద్ధంగా ఉంచాడు. దీనితో ఈ వ్యవహారం పెద్దదయి కూర్చుంది. ఈ రెండువందలమందీ వెళ్లేదారిలో సిద్ధంగా పొంచుని ఉన్నారు సంస్కరణ ప్రతిపక్షం వారు. మరాటీ సాహిత్యాభిమానులపక్షం వున్న ఫూలె అనుచరుల వెంటనే ఒక బ్రిటిష్ అధికారి, కొందరు పోలీసులు కూడా వెళ్ళారు. వీరిలో ఒక సబ్‌ఇన్‌స్పెక్టర్ బ్రాహ్మణ కులానికి చెందినవాడు. సంస్కర్తలంటే ఇష్టం లేదు. కాని, ఉద్యోగరీత్యా అధికారులకి లోబడి ఉన్నాడు.

తులసీబాగ్ అనేచోట — ఇక్కడ మత సంబంధమయిన సభలు జరుగుతూ ఉండేవి - సనాతనవాదుల ప్రతినిధి బందూ నానా రానెడె భవాల్కర్‌ని, 'మీ అభ్యర్థన రాసి ఇచ్చింది ఎవరు?' అని అడిగాడు.

'జోతిబా ఫూలె!' అని భవాల్కర్ అనటంతో రానడె వర్గంవారు నిరుత్సాహ పడిపోయారు. జోతిబాని దండించగలిగినవారు కారు వారు, అప్పటికి అతని వయసు ఇరవయిరెండు మాత్రమే అయినప్పటికీ.

కొంతకాలం పిదప ప్రభుత్వం శ్రీ దేశ్‌ముఖ్ వర్గంవారి అభ్యర్థనని ఆమోదించింది. (మొదట చేవ్రాలు పెట్టిన వారు కొందరు అభ్యర్థన తమకి ఇష్టం లేనట్లు ప్రకటించారు తర్వాత. ఇది మరొక పేచీకి దారితీసింది. కాని, చివరికి సంస్కర్తలే గెలిచారు) దీని ఫలితం ఏమిటంటే, ఈ నాటికీ దక్షిణ బహుమానం ఒకటి ఉంది. దాని మొత్తాన్ని ప్రతి ఏడూ మరాటీ భాషలో వెలువడిన అత్యుత్తమ గ్రంథానికి ఇస్తారు. ఇది అనువాదమయినా ఫరవాలేదు. 1674లో ఛత్రపతి శివాజీ నెలకొల్పిన దక్షిణ నేటికీ ఉందన్నమాట.

—ఎస్.

# 9999

## విధముల అందచందాల ఛాయలు ఏర్చుకోవచ్చు

ఏప్కొలైట్ ప్లాస్టిక్ ఎమల్షన్‌తో అంతంలేని రంగుల శ్రేణి మీ అందుబాటులో ఉంటుంది. 9999 రంగుల రకాలు, ఇంకా ఎన్నో ఛాయలు! కలలో మాత్రమే చూచిన వర్ణఛ్ఛాయలు కండ్లముందే కలుపుకోవచ్చు. ఏప్కొలైట్ ప్లాస్టిక్ ఎమల్షన్ రంగులను మిశ్రముచేయడమే; లేదా ఏప్కొలైట్ ఎమల్షన్‌ను ఏప్కొలైట్ స్టెయినర్స్‌తో కలిపితేచాలు. ఏప్కొలైట్ ప్లాస్టిక్ ఎమల్షన్ ప్రత్యేకంగా ఉష్ణదేశ శీతోష్ణానుకూలం చేయబడినందుచేత అమితమైన శీతోష్ణోగ్రతలను తట్టుకుంటాయి. త్వరగా ఆరిపోయి, ముఖమలువంటి మెరుగునిస్తాయి. లోపల, బయట ఉపయోగించడానికి అనుకూలమైనవి. ఇటుక మీదనైనా, థెర్మోకోల్‌తోనైనా ఉపయోగింపవచ్చు. రంగులు ఏర్చుకొనేటప్పుడు సర్వోత్కృష్టమైనవాటినే ఎంచుకోండి. ఏప్కొలైట్ ప్లాస్టిక్ ఎమల్షన్ ఎంచుకోండి.

**ఏప్కొలైట్ ప్లాస్టిక్ ఎమల్షన్ పెయింట్**







ఎక్కడ రంగు కావలెనో అక్కడ

**ఏషియన్ పెయింట్స్**



రూత్ వింటర్

# అమెరికాలో లైంగిక నేరాలు చెయ్యనివారెవరు?

అమెరికాలో టూత్‌పేస్టు అమ్మటానికికూడా అందమయిన అమ్మాయి బొమ్మ వాడ్తారు. అటువంటి ఈ దేశంలో సెక్స్—లేక—లైంగిక నేరాల విషయంలో చాలా కఠినమయిన చట్టాలు ఉన్నాయి.

అమెరికాలోని చాలా రాష్ట్రాలలో అవివాహితులు కామక్రీడలలో పాల్గొనరాదు. ఎన్నో రాష్ట్రాలలో కుటుంబ నియంత్రణ సాధనాల విక్రయం నేరం! ఎవరయినా ఒక పెళ్ళిఅయిన వ్యక్తి — ఎంత వయసు ముదిరినా సరే సంతాన నిరోధంకోసం ఏదయినా సాధనం కొంటే అతనికేకాక అతనికి దానిని అమ్మిన అంగడివారికికూడా శిక్ష పడటానికి అవకాశంఉంది

'సెక్స్ ఎండ్ ది లా' అనే పుస్తకంలో దాని రచయిత జడ్జి మారిస్ ప్లోస్కో ఇలా రాశారు: '...శాసనాలలో. సాంఘిక ధోరణులలో ప్రాచీన క్రయిస్తవ సిద్ధాంతాలముద్ర కనిపిస్తుందనటంలో సందేహంలేదు ప్రాచీన క్రయిస్తవులకి కామం ఒకపాపం ఇంద్రియ నిగ్రహం, అస్ఖలిత బ్రహ్మచర్యం.. గొప్ప గుణాలు. అవివాహితుల మధ్య సంబంధాలు మహాపాపాలు...

'కిన్సీ నివేదికనిపట్టి కామం విషయంలో మన చట్టాలని బాగా మార్చటం అవసరం అని తోస్తుంది చట్టప్రకారం నేరాలనుకునేవి చాలా సామాన్య మానవుడి సాధారణ ప్రవర్తనలాగ కనిపిస్తుంది.'

కిన్సీ నివేదిక ప్రకారం 59 శాతం స్వలింగ సంపర్కంలో పాల్గొన్నవారు; 17 శాతం జంతువులతో సంపర్కం కలవారు; వారకాంతలని దర్శించినవారు 70 శాతం ఉన్నారుట — ఇవి కిన్సీ ఇంటర్వ్యూ చేసిన వారిని పట్టివేసిన లెక్కలు.

'సామ్రాజ్య' కాలంలో వ్యభిచారానికి మరణదండన వేసేవారు! తర్వాత, తర్వాత ఈ దండనని తగ్గించి వ్యభిచరించిన వారి నుదిటిమీద 'ఎ' అనే ఇంగ్లీషు అక్షరం వాత పెట్టేవారు.

నేడు, ఈ 20వ శతాబ్దంలో. న్యూయార్క్‌లో వ్యభిచరించినవారికి 6నెలల నిర్బంధం, లేక దానితోబాటు 250 డాలర్ల (1875 రూ) జరిమానా పడవచ్చు.

కెన్నెడీల ఊరు బోస్టన్‌లో ఒక ఏడాది 242 మందిని వ్యభిచార నేరంపయి ఎరెస్టు చేశారు.

అమలులోఉన్న చట్టాలని గట్టిగా అమలుపరిస్తే నూటికి 95 మంది కారాగృహానికి వెళ్ళవలసి వస్తుందని డాక్టర్ కిన్సీ ఒకసారి అన్నారు

స్వలింగ సంపర్కానికి ఈ కింది రాష్ట్రాలలో శిక్షలు - న్యూయార్క్, ఒక సంవత్సరం జెయిలు; జార్జియా - నెవాడాలు, యావజ్జీవ కారాగృహవాసం; వర్జీనియా, మూడేళ్ళదాకా; టెనెస్సీ, అయిదేళ్ళదాకా

కనెక్టికట్ (యేల్ విశ్వవిద్యాలయం ఉన్న రాష్ట్రం)లో శిక్ష 30 సంవత్సరాల నిర్బంధం కావచ్చు, నార్త్ కరోలినాలో 60 ఏళ్ళు!

బలాత్కారం విషయంలో తప్ప తక్కిన నేరాలన్నిటిలోనూ సమాజానికి హాని అంతగా ఉండదని చాలామంది అభిప్రాయం. శాసనాలద్వారా నడవడిని బాగుచెయ్యడం—కనీసం ఈ సందర్భంలో—కష్టం అంటారు.

—(ఇన్‌ఫా)






కె. రామలక్ష్మి

### జరిగిన కథ

కళ్యాణి గవర్నమెంటు హాస్పిటల్లో డాక్టరు. ప్రిస్క్రిప్షన్లకంటే ఆమెకు సంతకాల గొడవే ఎక్కువ. ఆ పాటి చాంచల్యంతో ఒక పిల్లవాడ్ని హత్య చేసిందన్న నేరారోపణపై, పోలీసు ఉద్యోగి ఒకామెను కళ్యాణి వద్దకు తీసుకొచ్చాడు. కళ్యాణి ఆమెమీద ఎంతో జాలిపడింది స్నేహితురాలు లాయరు శాంతి సహాయాన్ని కోరింది శాంతి ఆమె తరపున కోర్టులో వాదించడానికి వకాల్తా పుచ్చుకుంది. నందూరులో సరళ చెప్పిన సంగతుల గురించి సమాచారం కొంత సేకరించారు. [illegible] ఒప్పుకున్నాడు. [illegible] ఒక ప్రేమకథని కోర్టులో చెబుతాడు.

## 7

ఎవరో ఒకరిద్దరు అలసి పోయారని సేదదీరాలని కాలగమనం ఆగిపోతుందా? ఆగదు.

సరళకు అదే సంబంధం నిశ్చయం అయినది వరునికి దరిదాపు ఏభయి సంవత్సరాలు. అయినే కోరికలు మాత్రం కుర్రతనం వదలలేదు

'గాడిదగా పెరిగిపోయింది దీనికీ సంబంధం కుదరడమే నా అదృష్టం'అని తాతగారు సంతోషపడి పోతూ ఉంటే — త్వరలోనే ముహూర్తం పెట్టించి పెళ్లి అయిందనిపించారు పెళ్లికుమారుడు ఇంట్లో ఆడదిక్కు కావాలని ఆత్రపడి పోతున్నాడు. అవునుమరి వంటావార్పూ కష్టంగా ఉంది. ఎదిగిన కొడుకులిద్దరూ ఉద్యోగాలు చూసుకుని వేరే వెళ్లి పోయారు అందుకే వండి పడేయడానికో ఆడది కావలసి వచ్చింది.

పెళ్లితోపాటే కార్యంకూడా జరిపించారు. అదీ పెళ్లిలాగే లాంఛన ప్రాయంగానే అనుకుంది సరళ కాని తన ఊహలు ఎంతలోతులేనివో ఇట్టే తెలిసిపోయింది వండి పడేయడానికే కాదు హింసించడానికి కూడా ఒక భార్యకావాలి ఆయనకి అని గ్రహించి తనని విధి ఆడిస్తున్న ఆటలకి నవ్వుకొంది సరళ

భర్తతో కలిసి గూడుబండిలో ఊరు చివరదాకా వెళ్లడానికే సిగ్గుపడింది ఊళ్లో అందరికీ తెలుసు తను ఎంతవెలాకీ అయినదో 'తగిన శాస్తి అయింది' అనుకుంటారు కాబోలు అనుకుంది సరళ.

బండిలో ఎక్కబోతూ తాతగారి పాదాలకి వంగి నమస్కరించింది సరళ.

ఆయన ఎంత కర్కోటకుడైనా తను చేసిన పనిలోని అన్యాయం కళ్లముందు కట్టినట్లయింది కాబోలు. 'దీర్ఘసుమంగళివిగా ఉండుతల్లీ' అని దీవించారు. ఆయన కళ్లు చెమర్చాయి.

బండి కదలింది. బస్సుదాకానే ఈ బండి ప్రయాణం. 'ఎందుకలా ఒదిగి ఒదిగి కూర్చుంటావు? నా పెళ్లాం అనుకుంటారని భయమా?' కసిరినట్టు అనడంతో తలెత్తి కూర్చుంది సరళ.

ఊళ్లో అమ్మలక్కలు తిన్నెలమీద నిలబడి వింతగా చూస్తున్నారు నూతన దంపతులని.

'ముసలాడికెలా ప్రాణం ఒప్పిందో బంగారం లాంటి పిల్ల' అని ఒకరిద్దరు అనుకోవడం స్పష్టంగా వినిపించింది సరళకి. ఆమాటలు భర్త వింటే ఏమనుకుంటాడో అని భయపడింది బస్సులోకూడా కొత్త పెళ్లికూతురిని చూసి, కూడా ఉన్న పెళ్లికుమారుణ్ణిచూసి అంతా [illegible] కొరుక్కోవడమే.

'కాకి ముక్కు దొండపండు' అన్నట్టుంది జోడీ అనుకున్నారు.

'ఈ ప్రయాణం అనంతంగా సాగేలా వుందే! త్వరగా గమ్యం చేరితే బాగుండును' అనిపించింది సరళకి

'అత్తవారి ఊరుకూడా పుట్టిన ఊరులాగా పల్లెటూరే ఎట్చొచ్చీ ఏటికి వెళ్లి నీళ్లు తేనక్కరలేదు. పెరట్లో నుయ్యి ఉంది ఊళ్లో చెరువు ఉంది కాని నెల్లి... రోజే భర్త చెప్పాడు 'చెరువు గట్లంట తిరగడం' ఇష్టంలేదు తనకని.

'అక్కడికి నాకు ఇష్టం ఉన్నట్లు' అనుకుంది సరళ.

తన ముఖం ఎవరికీ చూపెట్టడం ఇష్టం లేదు సరళకి.

సగం చచ్చి బ్రతుకుతున్న ... కొత్త పెళ్లికూతురా అని అంతా పలకరించేవారే

తన వయస్సు పిల్లలు పిల్లా పాపలతో కలకలాడుతూ తిరుగుతూంటే వింతగా చూడ్డం తప్పించి మనసులో బాధ పడ్డం కూడా మరిచిపోయింది సరళ.

ఉదయం లేచింది మొదలు రాత్రి పడుక...

పోయేదాకా కావలసినంతపని. దానికి తోడు అరికాళ్ళకింద నిప్పులు పోయడానికి ఇంట్లో వెధవాడబిడ్డ ఒకతె.

మనసు పరిపరివిధాల పోడానికి ఇక అవకాశమే లేదు. కాని రాత్రి పడుకున్నాక మటుకు విశ్రాంతి ఎక్కడిది ?

ప్రేమకు వింత భాష్యం చెప్పే భర్త.

తొలికోడి కూత వినడంతోనే లేవకపోతే అష్టోత్తరం ప్రారంభించే ఆడబిడ్డ.

మెలుకువలోనూ నిద్రలోనూ కూడా విశ్రాంతిలేదు సరళకి. రోజూ ఎత్తిపొడుపు మాటలూ, తిట్లూ శాపనార్థాలూ అలవాటే అయిపోయినా ఒకనాటి రాత్రి భర్త వేసిన ప్రశ్నకి అదరిపడింది సరళ.

'నువ్వే పెళ్లి చేసుకో నన్నావుటగా !' తమలపాకులు నములుతూ వ్యంగ్యమో వేళాకోళమో తెలియని విధంగా అడిగాడు.

'లేదు.' అనలేదు అంది సరళ.

నోటిమాట పూర్తిగా బయటపడకుండానే చెంప ఛెళ్లుమనడం—

'రంకాడిన దానివి బొంకాడడం నీకు నేర్పాలా?' అనడం ఒక్కసారే జరిగాయి.

ఆ దెబ్బకి కంట నీరుకూడా రాలేదు సరళకి.

'లేదు నేను చేసుకుంటాననే చేసుకున్నాను. మీరు దయాస్వభావులు; కట్నం కానుకలు కోరలేదు. మా తాతగారు ఇచ్చుకోనూ లేరు. తాతగారి మాట కాదని నెప్పుడూ అనలేదు' అంది సరళ— మంచం పట్టెమీద కూర్చోబోతూ.

ఒక్కతోపు తోశాడాయన. వెళ్లి ఎదురు గోడకి కొట్టుకుంది సరళ. చేతిగాజు చిట్లి రక్తం వచ్చింది.

'నాకు తెలియదనుకోకు' అంటూ అటువైపు తిరిగి పడుకున్నారు.

సరళకి తెలుసు. ఇది జీవితంలో ఇంకో మలుపు అనుకుంది.

'ఇలా రా' అని భర్త పిలిస్తే మరమనిషిలా వెళ్లి మంచంమీద వాలిపోయింది. శరీరం అలసి నిద్రపోయింది. ఆ రోజుతో కొత్తరకం బాధ ప్రారంభం అయింది సరళకి. ఇంట్లో అనుమానాలు ఎక్కువ అయ్యాయి.

'ఎందుకక్కడ నిలబడ్డావు ? ఎవడొస్తాడని ?' లోపలికి గెంటినంతపని చేసేవాడు.

వీధిగడప తొక్కడం మానేసింది సరళ.

పెళ్లిళ్లు అయి విడిగా ఉన్న వారి కొడుకు లిద్దరూ చాలా ఉత్తములు అని తెలుసుకొంది. కాని ఏం లాభం? వాళ్లు ఇంటికివస్తే తన కట్టడి మరీ ఎక్కువ అయింది.

పగలంతా చూపులతో కాలుస్తే— రాత్రి దెబ్బలతో కాల్చేవారు.



పెళ్ళయిన పది నెల్లో పాతిక సంవత్సరాలు పెరిగాయి సరళకి కళ్ళకింద నల్లని వలయాలు ఏర్పడ్డాయి సంస్కారం లోపించిన శరీరాలు భయంకరంగా ఊడిపోయి పీలకజడ మిగిలింది 'జాట్టు పట్టుకు



# ఆడది

ఈడ్చి కొట్టేవాళ్ళున్నప్పుడు యిలా చిన్న జబ్బు ఉండటమే మంచిది' అని తనలో తనే నవ్వుకొనేది.

కొట్టినా తిట్టినా సమాధానం చెప్పలేని రాయిగా మారిపోయిన సరళలో కొత్త చిగుళ్ళు తొడుక్కుంటూ ఆశ రేకెత్తింది.

అదేమిటి ?

సరళ నెల తప్పింది. రెండు మూడు మాసాలు అయేక లక్షణాలనుపట్టి గ్రహించిన ఆడబిడ్డ ఇంటి మగవానిచెవిన వేసిందీవార్త.

తండ్రి కాబోతున్నానని సంతోషంతో ఉక్కిరి బిక్కిరి అవుతారు అనుకొంది.

కాని—

'ఎందుకు చెప్పలేదు?' అని నిలదీసిన భర్తకి ఏం సమాధానం చెప్పాలో తెలియలేదు

'నాకే ఇంకా అయోమయంగా ఉంది. మీకేం చెప్పను?' అంది గుడ్లనీళ్ళు కుక్కుకుంటూ.

'సంగనాచివి నీకు తెలియని విషయాలు కూడానా?' అంటూ చీదరించారు.

ఆప్యాయంగా దగ్గిరకి తీసుకుంటారను కుందుకు ఆస్కారం లేకపోయినా, ఇలా అంటారని అనుకోలేదు సరళ.

కాని ఎందుకొచ్చిందీ బాదరబందీ అని అనుకోలేకపోయింది రూపం దిద్దుకొని గర్భస్థజీవం సరళలో ఉత్సాహాన్ని నింపింది పాప అంటూ ఒకటి ఉంటే తనజీవన పథంలో ఏరకమైన మార్పేనావస్తుందేమో అన్న ఆశ చావడంలేదు.

నెలలు నిండుతున్నకొద్దీ ఏవేవో అనుమానాలతో ప్రత్యక్ష నరకం చూపెడుతున్నారు. అయినా పెదవి మెదపడానికి సాహసించలేదు సరళ.

ముద్దుముచ్చట్లుచేసి ఆదరించి తీసువెళ్లే పుట్టిల్లు లేదు. ఇక్కడ తను నోరుతెరిస్తే పోడానికింకో స్థలంలేదు — అది పూర్తిగా తెలిసే సరళ మాటలు మరిచిపోయింది ఈ శిశువుకి తండ్రి తాను కాదన్న అనుమానం కార్చిచ్చులాగా దహించేస్తూంటే ఆయనగా రెంతకాలం దిగమింగుకోగలరు ? ఆబాధ బయటపెట్టడానికే సరళ ప్రాణాలు తోడేవారు. నెలలు నిండడంతో భారం పెరిగి అడుగుతీసి అడుగు వేయలేనంత శక్తిహీనగా తయారైంది సరళ. అయినా ఇంటిచాకిరి తప్పలేదు. కోతా తప్పలేదు. పండిపోయిన ఫలం రాలకుండా ఉండదు కదా ? అన్నిటినీ భరిస్తూనే ఒక చలిరాత్రి పెరటిపాకలో గుడ్డిదీపం వెల్తురులో నాటు మంత్రసాని సహాయంతో సరళ ప్రసవించింది.

ప్రసవానికిముందు యమయాతన పడుతూంటే ఓదార్చేమనిషే లేకపోయింది.

ఆయన లేసప్పుడు వచ్చి పలకరించిపోయే ఇరుగు పొరుగులుకూడా తొంగిచూడలేదు. ఆయనన్నా, ఆడబిడ్డ అన్నా సింహస్వప్నం చుట్టుపక్కలవారికి.

మంత్రసానే ఆకబురు ఈకబురు చెప్పింది. ఆమె మాటలు సరళకి ఊరట కల్గించడానికి బదులు మరింత పిరికిదాన్ని చేశాయి.

'ఆ తల్లినీ ఇలాగే కాల్చుకుతిన్నాడు కదమ్మా! నేనేకా అప్పుడూ ఉంట' అంటూ మంత్రసాని తమలపాకులు వేసుకుంటూ చెప్తూంటే ఉరమని పిడుగుపడ్డట్టు భయపడింది సరళ.

'అనుమానంకొద్దీ వెల్లు నిండిన మనిషిని చావ చితకపొడిచాడు. దాంతో ఆ యిల్లాలు చచ్చిన బిడ్డనికని రెండ్రోజులుండి కళ్ళు మూసింది. ఇంకా నీకు నయమే రెండు పూటలా అన్నం పెడుతున్నారు!' అంది మంత్రసాని.

'ఎంత అదృష్టం నాది' అనుకుంది సరళ.

ఎలాగో ఉదయంనుంచి రాత్రి సగం గడిచేదాకా బాధపడి ప్రసవించింది సరళ.

ఆకాశంమీద కొత్త తారకలు పుట్ట లేదు.

భూకంపాలు రాలేదు.

కనీసం నగులైనా పొంగలేదు.

సరళ ప్రసవించింది. కోట్ల కొద్దీ ఆడవారు ప్రసవించేటట్టే సరళకూడా ప్రసవించింది. కాని ఈ ఆనందం పంచుకొందుకు ఎవరూ లేరు. ఈ పసివాణ్ని గుండెల కత్తుకుందుకు ఒక్క తల్లి మినహా ఎవరూ లేరు — అదే తేడా

సరళ ప్రసవించి నెలా పదిహేను రోజులు కూడా గడవలేదు భర్త మంచం ఎక్కాడు.' హృద్రోగం అన్నారు వైద్యులు

'తునివెళ్లి మంచి డాక్టరుకి చూపెడదాం' అంది సరళ

'ఏం అక్కడ నీకు తెలిసినవాడున్నాడా ?' అని ఎదురు అడగడంతో మరి మాట్లాడ

# మీ కుటుంబ ఆరోగ్యముకోసం విటమినులు మరియు ఖనిజములు ఆవశ్యకం.

## ఇవి చాలినన్ని వారికి లభించుచున్నవా?




## క్రొత్త విమ్‌గ్రాన్® మల్టిపుల్ విటమినులు-ఖనిజముల బిళ్లలు!

విటమినులు మరియు ఖనిజముల లోటు మీ కుటుంబ ఆరోగ్యమును పాడుచేయును. అలసట, జలుబు, ఆకలి మందం, నీరసము, చర్మ వ్యాధులు మరియు పళ్ల జబ్బులు...ఇవి ముఖ్యావశ్యకమైన విటమినులు మరియు ఖనిజముల లోటు వల్ల సామాన్యంగా సంభవించుచుండును.

బహు జాగ్రత్తయైన శ్రద్ధతో యోచించి తయారుచేయబడు ఆహారములందు సహితము ఇంకా ఈ విటమినులు, ఖనిజములను గురించి కొరుచు లోపం కలుగును. ఘనమైన, పుష్టికర ఆహారమంతయు సంతులితమైన ఆహారము కానేరదు. అనేక విధాల ఆహారములందు విటమినులు ఖనిజముల లోటు వుండును. అట్టి సందర్భంలో మీ కుటుంబము ముఖ్యావశ్యకమైన విటమినులు, ఖనిజములు అన్నియు—సరియైన మోతాదులలో పొందుచున్నారని మీరు ఎట్లు నిర్ధారణ చేసుకోగలరు?

మీ కుటుంబములో ప్రతి ఒక్కరికన్ని ఈ ముఖ్యావశ్యకమైన పుష్టికర పదార్థములను వారికి కావలసిన మోతాదులలో పూర్తిగా లభించుచుండుటకు వారికి విమ్ గ్రాన్-స్క్విబ్ మల్టిపుల్ విటమినులు-ఖనిజముల బిళ్లలను ఇవ్వండి. రోజుకి ఒక్కటి ఈ ఆరోగ్యకరమైన అలవాటును నేటి నుండియే ఎందుకు ప్రారంభించగూడదు?

విమ్ గ్రాన్‌లో పదకొండు ముఖ్యమైన విటమినులు, ఎనిమిది ఖనిజములు సరియైన మోతాదులలో వున్నవి. ఎఱ్ఱని రక్తకణములను వృద్ధి పరచి, శక్తిని కలిగించుటకు ఐరన్, ఎముకలను, పళ్లను దృఢముగా నుంచుటకు కాల్షియమ్, జలుబును నిరోధించే శక్తిని బలపరచుటకు విటమిను సి, మంచి నేత్ర దృష్టికి మరియు ఆరోగ్యవంతమైన చర్మమునకు విటమిను ఎ, ఆకలిని పుట్టించి అంతర్వ్యశక్తిని పెంపొందించుటకు విటమిను బి12, అంతేగాక మీ కుటుంబ ఆరోగ్యము నిమిత్తం అవసరమైన ఇంకా యితర ముఖ్యమైన పుష్టికర పదార్థములు గలవు.

విమ్ గ్రాన్ ఒక్క బిళ్ల ఖరీదు సుమారు 13 పైసలు మాత్రమే. మీ కుటుంబ ఆరోగ్యము కోసం నిజంగా బహు స్వల్ప ఖర్చు. ఈ దినమే విమ్ గ్రాన్ కొనండి—ప్రతి దినమూ విమ్ గ్రాన్ తీసుకోండి.

# విమ్‌గ్రాన్®

విమ్ గ్రాన్ ఒక్క బిళ్లే
దినమునకు
మీకు పుష్టికరం

® ఇ. ఆర్. స్క్విబ్ & సన్స్, ఇన్కార్పొరేటెడ్ వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కుకు చిహ్నం; రిజిస్టర్డు వినియోగదారులు కరంచంద్ ప్రేంచంద్ ప్రయివేట్ లిమిటెడ్.

SQUIBB® SARABHAI CHEMICALS

Shilpi SC 256 TEL

లేదు సరళ.

పురిటాలు అయిఉండీ అన్నిపనులూ చేస్తూ, మంచంపై ఉన్న భర్తకి సమయానికి అన్నీ ఇస్తూ తోడుకావడాలూ—పట్టు, ఒకటేమిటి చెప్పినవన్నీ చేస్తుంది.

ఎవరి పిల్లవాడో అన్నట్టు పసివాణ్ణి ఎవరూ పట్టించుకోలేదు. అసలే ఆప్యాయత అంతంతమాత్రం.

దానికితోడు తండ్రి మంచం పట్టడంతో మరీ దారుణం అయింది.

'ఏ ముహూర్తానవచ్చి దాపురించిందో!' అన్నమాట రోజుకి ఎన్నిసార్లువిన్నా తనలో తాను నవ్వుకుంటుందేగాని సరళ సమాధానం చెప్పదు.

అన్నిరకాల నాటువైద్యాలూ అయ్యాయి.

చివరిదశలో తునికి తీసుకువెళ్ళారు. కాని సమయం మించిపోయింది. సరళ ఐదోతనం తీసుకుని ఆయన కన్నుమూశాడు పట్టుమని ఇరవైరాని సరళ పసివాడితోటీ పుట్టెడు దుఃఖంతోటీ మిగిలిపోయింది.

కర్మకాండకి తాతగారు వచ్చారు. అంతా అన్నిరకాల ఓదార్పుమాటలు చెప్పారు. కాని ఇటుపై తన జీవితం ఎలా సాగుతుందో సరళకి తెలుసు. ఆయిన ఉన్నప్పుడే అత్తింటి కాపురం అనిపించిన ఆడబిడ్డ విజృంభించి తనకి క్షణం విశ్రాంతి ఉండనివ్వదని తెలుసు.

'జుట్టు తీయించి మూలకూర్చోపెట్టాలే సరి' అని ఆడబిడ్డ ఇచ్చిన సలహా ఎవరూ ఆమోదించకపోవడంతో ఆయోగం తప్పింది సరళకి.

ఇంటిపని, మిగిలినసమయం పిల్లవాడిపని. ఇదేలోకంగా రెండునెలలు గడిపింది సరళ.

అలసిన మెమనస్సు కొంచెం కుదుట పడుతూంది. కానిదైవం ఈ మాత్రపు ప్రశాంతతని కూడా చూడలేక పోయాడు. ఆడబిడ్డ కొడుకు కోడలు వేరింటి కాపురం ఎత్తేసి ఇక్కడికి వచ్చేశారు. దాంతో పెనం మీదనుంచి పొయ్యిలో పడ్డట్టయింది సరళపని.

తనని చీదరించుకున్నా తిట్టినా కొట్టినా బాధపడని సరళ పసివాణ్ణి ఎవరేమన్నా భరించలేక పోతూంది. ఎంత నోరుతెరవ కూడదనుకున్నా సమాధానం చెప్పాలని పిస్తుంది.

'ఆయిన వాణ్ణి పొట్టనిపెట్టుకున్నాడు దరిద్రుడు' అనీ

'చూడు వెధవ ఏడుపు!' అని విసు క్కుంటూ ఉంటే—సాధ్యమైనంత వరకు ఏడవకుండా చూసుకోవాలని ప్రయత్నించేది.

'వాడేడిస్తే మీకేం? నవ్వితే మీకేం?' అని ఒకరోజు సమాధానం చెప్పింది సరళ.

'అబ్బ! ఏంగారం! ఎవడికి పుట్టిన కొడుకని?' వెటకారంచేస్తూ మాటలతోనే నిలువునా కాల్చింది ఆడబిడ్డ. అన్నీ అనుభ విస్తూ ఏ వసంతానికో ఎదురుచూస్తూ కాలం వెళ్ళబుచ్చింది. సరళ. పిల్లవాడికి ఏడాది రాలేదు... ఆ రోజు తాతగారు వచ్చారు.

'తుని వచ్చానమ్మా కోర్టు పనిమీద. చూసిపోదామని వచ్చాను' అన్నారు వీధి అరుగుమీదే కూర్చుంటూ.

ఎవరూ ఆయన్ని పలకరించలేదు.

సరళ కాళ్ళు కడుక్కుందుకి నీళ్ళిచ్చి వచ్చి పక్కనే కూర్చుంది.

'పోనీ కొన్నిరోజులు వచ్చి అక్కడ ఉంటావా?' అడిగారు తాతగారు.

'వద్దు ఇక్కడే ఉంటాను' అంది నిశ్చితంగా సరళ.

తాతగారికి చెప్పకపోయినా తెలుసు—సరళ రాదని.

సరళకీ తెలుసు తానా ఊరు వెళ్ళలేనని.

ఓ అరగంట కూర్చుని వెళ్ళిపోయారు తాతగారు.

తాతగారు వెళ్ళిపోయాక పిల్లవాణ్ణి ఒళ్ళోపెట్టుకుని భోరున ఏడ్చింది సరళ ఇన్నాళ్ళూ కరగని హృదయం కరిగి కన్నీళ్ళుగా మారింది. హృదయం పగిలేలా ఏడ్చింది.

'పోలేక పోయావూ—పాపంచ పట్టుకు వేళ్ళాడకపోతే' అని ఆడబిడ్డ అంటున్నా వినిపించుకోలేదు సరళ.

తాతగారు వెళ్ళడం వెళ్ళడం తిన్నగా తుని బస్సుస్టాండుకివెళ్ళి కూర్చున్నారు. ఆయనకి చాలా నీరసంగా ఉంది. సరళని చూసి వచ్చాక ఉన్నశక్తి ఉడిగిపోయి నట్టయింది. బస్సుస్టాండులో కూర్చున్న ఆయన ముఖానికి బుజంమీది కండువా అడ్డంవేసుకుని కంట తడిపెట్టారు. తానుచేసిన దారుణం ఎదుట నిలబడి వెక్కిరించిందాయనని.

'ఎంత అన్యాయం చేశాను! ఎంత అన్యాయం జరిగిపోయింది!' అని ఎన్ని సార్లు అనుకున్నా జరిగినదాన్ని తుడిచి వేయడం ఎవరితరం?

దుఃఖంతో కుంగిపోయిన తాతగారి నడుం విూద కొట్టినట్టయింది — చేతి సంచితో గబ గబ బస్సుస్టాండులోకి నడిచి వస్తున్న అతణ్ణి చూసి.

ముఖం ఎత్తి పలకరించ బుద్ధికాలేదు.

పచ్చని దేహకాంతి, నల్లని విూసకట్టు, చారల షర్టులో అతగాణ్ణి సరళ పక్కన ఊహించుకుని మూగగా మూల్గింది ఆయన హృదయం.

అతనే తాతగారిని చూసి దగ్గరికివచ్చి నమస్కరించాడు.

'కులాసాగా ఉన్నారా తాతగారూ?' పలకరించాడు.

చుట్టూ జనం హడావిడిగా తిరుగుతున్నా ఇద్దరూ ఏకాంతంగా నిర్మానుష్యంగా ఉన్న ద్వీపంవిూద నిలబడినట్టు ఉన్నారు.

'నువ్వేం.. ఉన్నావు? ఎక్కడా కనిపించడం లేదు.' కంఠంలో ఒణుకు కనబడకూడదన్న తాతగారి ప్రయత్నం వ్యర్థయత్నం అయింది.

'తునిలో మేష్టరుగా చేరాను తాతగారూ. ఏదో కాలక్షేపానికి' అన్నాడు. సరళని గురించి అడగాలని. కాని ఎలా ప్రారంభించాలో తెలియలేదు.

తాతగారే అన్నారు.

'సరళని చూసి వస్తున్నాను.'

'ఎలా ఉంది సరళ? పిల్లలా?' కుతూహలంతో అడిగాడు.

తాతగారి ముఖం చాలా గంభీరంగా మారిపోయింది.

'సరళకేం? ఇంకా బ్రతికేఉంది బాబూ, నా ప్రాణానికి ఉసూరుమంటూ బ్రతికే ఉంది. దానికో కొడుకు'. అన్నారు.

'మీ రెండుకలా యిదౌతారు? ఎక్కడో అక్కడ సుఖంగా ఉండడం కదా కావాలి?' ఓదార్పుకోసం అన్నాడే గాని అతనికి బాధగానే ఉంది.

'అది సుఖంగాలేదు బాబూ సుఖంగా లేదు. నాయింట అది పడ్డ బాధలవిూద ఇప్పటిది అగ్నికి ఆజ్యం తోడయినట్టుంది. దాని జీవితంలో నిప్పులుపోశాను.' దుఃఖంతో తాతగారి కంఠం పూడుకుపోయింది.

తాతగార్ని తీసుకువెళ్లి ఒకపక్కగా కూర్చోపెట్టాడు అతను.

'తాతగారూ విూరిలా క్రీలా పడిపోవడం బాగులేదు ఏమైంది? నాతో చెప్పకూడదా? విూ పిల్లవాడినే అనుకొండి' - అనునయంగా అడిగాడు పక్కనే కూర్చుంటూ.

'ఏం చెప్పను బాబూ సరళని చూస్తే కడుపు తరుక్కుపోతూంది. నా ఛాందసం కొద్దీ దాని గొంతుకోశాను బాబు, ఏవీ అనుకోకపోతే ఓసారి వెళ్ళిచూసి ధైర్యం చెప్పివస్తావా?' ప్రాధేయపడుతున్నట్టు అడిగాడు.

'అపార్థం చేసుకుంటారేమో తాతగారూ?'

'లేదు బాబూ, దాన్ని చూస్తే నాకేదో భయంగా ఉంది. తుఫాను చెలరేగడానికి ముందు సముద్రం లాగా అతి గంభీరంగా ఉంది. చాలా అసహజమైన గాంభీర్యం అది. దాని భర్త పోయాడు నీకు తెలుసా?'

'నిజంగానా? అయ్యో పాపం!' అన్నాడే గాని అతని మెడవిూద ఎవరో బలంగా కొట్టినట్టు అనిపించింది. కళ్లముందు దృశ్యాలు హఠాత్తుగా చెదరి రెండు రెండుగా కనిపిస్తున్నాయి. కనిపించని వేవేవో వస్తువులు కళ్ళముందు తేలి పోసాగాయి.

'నిజంగానా తాతగారూ?' తను విన్నది పొరపాటేమో అని రెట్టించి అడిగాడు.

'అవును బాబూ, మూడునెల్లు దాటిపోయింది. అతగాడున్నప్పుడెలాగా గడిచిందో గాని ఇప్పుడుమటుకు చాలా దైన్యంగా ఉంది దాని స్థితి. వీలు చూసుకు వెళ్ళి చూసిరా బాబూ,' అన్నారు తాతగారు.

'అలాగే తాతగారూ, నేనెప్పుడూ ఊహించలేదు ఇలాగ జరుగుతుందని పాపం. ఉత్త అమాయకురాలు, పిరికిది' అన్నాడు అతను.

బస్సు వస్తున్నట్టుంది. బస్సుస్టాండులో సందడి ఎక్కువ అయింది.

తాతగారు అతని చేయి పట్టుకున్నారు.

'బాబూ జరిగినది జరిగిపోయింది. ఇక ఏ మాత్రం అవకాశం ఉన్నా సరళని కంటికి రెప్పలా కాపాడుతానని మాట ఇవ్వకలవా?'

'తప్పకుండా నాకు మాత్రం ఎవరున్నారు తాతగారూ? మీరేం బెంగపడకండి, నేను అన్నీ కనుక్కుని వచ్చి చెప్తాను.' అని అప్పుడే వచ్చి ఆగిన బస్సులోకి తాతగారిని ఎక్కించేశాడు అతను.

బస్సు కదిలేదాకా ఆగి తిన్నగా ఇంటికి నడిచాడు.

మనస్సు మొద్దుబారి పోయింది.

(ఇంకా ఉంది)



## అభియోగాలలో వింతలు

# అన్యాయంగా 38 రోజులు కారాగారంలో ఉన్న యువకుడు

'అబ్బాయీ! చిన్న పొరపాటు ఫలితంగా 38 రోజులు అన్యాయంగా నువ్వు కారాగారంలో ఉన్నావు నిన్ను వదిలి వేస్తున్నాము. తక్షణం ఇక్కడి నుంచి వెళ్ళవాయన' అని న్యాయమూర్తి డబ్ల్యు. ఎ. బ్రేషా పదిహేడు సంవత్సరాల వయస్సు జాన్ ఫ్రెడిక్ కు చెప్పారు.

అసలు జరిగినదేమిటంటే 'బెదరించిన' నేరానికి ఆక్స్‌ఫర్డ్ జైలులో ఫ్రెడిక్‌ను నిర్బంధంలో ఉంచారు. ఈ నిర్బంధం ఆగస్టు 16న ప్రారంభమయినది. ఇదే నేరానికి ఇంకో నలుగురు యువకులకు జైలు శిక్ష విధించారు.

ఫ్రెడిక్ చేసిన నేరం గురించి సెప్టెంబరు 25న విచారణ ప్రారంభమయినప్పుడు రీడింగ్ క్వార్టర్ సెషన్స్‌లో నేరారోపకుల తరఫు న్యాయవాది శ్రీ క్రిస్టాఫర్ కాంప్టన్ ఇట్లా చెప్పారు:

'ఈ యువకుడు చేసిన నేరాన్ని విచారణ జరిపే అధికారం యీ న్యాయస్థానానికి లేదని తెలిసింది. బెదరించుతూ మాటాడిన నేరానికి మాత్రమే దిగువ న్యాయస్థానం యీ యువకునికి శిక్ష విధించినది. న్యాయచట్టం ప్రకారం ఈ అభియోగాన్ని సెషన్స్ విచారణకు పంపించి ఉండవలసినది కాదు. ఈ అభియోగాన్ని తిరిగి మేజిస్ట్రేట్ల వద్దకు పంపించడం సమంజసంగా వుంటుంది.'

న్యాయమూర్తి క్లాడ్ డులీన్ ఇట్లా చెప్పారు:

'ఫ్రెడిక్! మేజిస్ట్రేట్ల వద్దకు వెళ్ళి, మీకు అధికారం లేకపోయినప్పటికీ మీరు నన్ను ఆరు వారాలు జైలులో ఉంచారని చెప్పు.'

ఆ తరువాత మేజిస్ట్రేట్ కోర్టులో విచారణ జరిగినది. ఈ యువకుణ్ని సెషన్స్ విచారణకు పంపించిన మేజిస్ట్రేట్‌ల అధ్యక్షుడు డబ్ల్యు. వి. బ్రేషా ఇట్లా చెప్పారు.

'గుమాస్తా సర్ జాన్ హెడ్జెస్ చెప్పిన మాటలమీద ఆధారపడి నిన్ను సెషన్స్‌కు పంపించాము. నీ మీద జరిగిన ఆరోపణలకూ మిగతా నలుగురు యువకులమీద జరిగిన ఆరోపణలకూ తేడా వున్న సంగతి మాకు తెలుసు. కానీ వ్యవహార నిర్వహణ గురించి 'క్లార్క్' చెప్పిన సలహామీద ఆధారపడినాము.'

సర్ జాన్ హెడ్జెస్ ఇట్లా చెప్పారు: శుద్ధ తప్పు సలహా యిచ్చాను. ఇందుకు చాలా విచార పడుతున్నాను. కానీ ఒక సంగతి—ఈ యువకు లందరిమీదా ఒకేరకం ఆరోపణలు జరిగినవి. సాక్ష్యాలు కూడా ఒకేవిధంగా ఉన్నవి. కనుక అయిదు అభియోగాలకూ ఒకేరకం విచారణ పద్ధతి వర్తించుతుం దనుకున్నాను.'

'ఈ రకం అనుభవం ఇంతకుముందే కలిగివుంటే ఎంత బాగుండేదీ' విచారణలు జరగవలసిన అభియోగాల జాబితాను చూచి ఫ్రెడిక్ జామీనుమీద విడుదలకోసం న్యాయమూర్తి మందిరంలో దరఖాస్తు చేసుకోవాలని న్యాయమూర్తి డులీన్ అన్నారు.

'కానీ, ఛేంబర్స్‌లో ఉండే న్యాయమూర్తికి అట్టి అధికారంలేదని ఈ అభియోగంలోని నిందితుని జామీనుమీద విడుదల చేసే అధికారం లేదని ప్రభుత్వ సొలిసిటర్ చెప్పారు అతనిని వెంటనే విడుదల చేసే ఉత్తర్వుపై మేజిస్ట్రేట్ చేత సంతకం చేయించవలసినదిగా కోరారు.'

—వి. ఎస్. అవధాని






మంగేష్‌రావు తెల్లవారుతూండగా బయలుదేరాడు. రెండుగంటలుగా నడుస్తూనే ఉన్నాడు ఈ కొండ పైకి చేరటానికి అర గంట పట్టింది.

సూర్యుడు నడినెత్తి కెక్కటానికి ఇంకా చాలా వ్యవధి ఉంది; కాని ఎండ తీక్షణం మాత్రం తక్కువగాలేదు మంగేష్‌రావు ఒళ్ళంతా చెమటతో తడిసిపోయింది. విశ్రాంతికోసం ఒక జీడిమామిడిచెట్టు కిందకిచేరి, అక్కడే కూర్చున్నాడు. రుమాలుతో ముఖం తుడుచుకున్నాడు, విసురుకున్నాడు.

అతని ముందు పరుచుకుని ఉన్న కొండ చరియ వసంతకాలపు శోభతో పచ్చగా, మెత్తగా కనిపిస్తోంది. ఎటు చూసినా జీడిమామిడి చెట్లు — వాటి పళ్ళు పొద్దు టెండలో ఎర్రగా, పసుప్పచ్చగా మెరుస్తున్నాయి.

దుబ్బుగా ఎదిగిన పొద వెనుక తోపులో ఎత్తుగా ఎదిగిన కొబ్బరి, పోకచెట్ల వరుసలు—వాటి వెనకాల చిన్న లోయలోని ఊరు ఇంచుమించు కనుమరుగయిపోయి ఉంది. మంగేష్‌రావు కూర్చున్నచోటునుంచి దేవాలయం విమానం, ధ్వజస్తంభం, ఇవి రెండు మాత్రమే స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఈ రెండూ ఎన్నిఏళ్ళగానో, ద్వారపాలకులలాగ నిటారుగా నుంచుని, బాటసారులకి ఊరి పరిసరాలని తెలుపుతూ వచ్చాయి. 'అమ్మయ్య! ఇక దగ్గరకొచ్చేసింది...' అనుకున్నాడు మంగేష్‌రావు.

ఆయాసం తీరిన తర్వాత ఉషారుగా లేచి నుంచున్నాడు. గొడుగుతో ఒక కొమ్మని కిందికివంచి పళ్ళుకోసుకున్నాడు. వాటి రసం చప్పరిస్తూ ఊరివయిపుగా లోయలోకి దిగి నడిచి వెళ్ళిపోయాడు.

పావుగంటలో కొండ చరియ చాలా మట్టుకు దిగివేశాడు; హటాత్తుగా చెట్ల మధ్యనుంచి ఒక పెద్ద సరస్సు కనిపించింది. సరస్సుచుట్టూ పూరికప్పులువేసిన మట్టి గోడల గుడిసెలు ఉన్నాయి.

అక్కడక్కడ పచ్చటి కొబ్బరితోపులు, పళ్ళతోటలు; సరస్సుకి ఉత్తరంగా కలిసే చిన్న కొండవాగు; దక్షిణం వయిపున ఉధృతంగా పొంగిన సముద్ర వంకాన్ని అరికట్టే చిన్నకట్ట — ఈ దృశ్యాన్ని చూస్తూ నుంచుని ఉండిపోయిన మంగేష్‌రావ్‌ని ఎవరో 'ఏ ఊరు బాబూ, మీది?' అని అడగటంతో కొంచెం ఉలిక్కిపడ్డాడు. బాగా రయితు

యాసలో తన్ను ఇలా పలకరించింది ఎవరా, అని చుట్టూ కలయచూశాడు. ఎవరూ కనిపించలేదు.

'మా ఊరికేసి చూస్తున్నారేంటి బాబూ? అయిదేళ్లయింది ఇలా ఎండిపోయి!'

మంగేష్‌రావ్ తన ఎడంవైపుగా పైకి చూశాడు. కంఠస్వరం పైనుంచి వచ్చినట్లుంది. పెద్ద మర్రిచెట్టు కొమ్మలమధ్య వయస్సుమళ్లిన రైతు ఒకతను కూర్చుని ఉన్నాడు. చెట్టు ఎండిపోయి ఉంది. అప్పుడప్పుడు చిన్న కొమ్మలు తుంచి కిందనే మందంగా మేస్తున్న ఒక బక్కావునుకి వేస్తున్నాడు. తనని పలకరించిన మనిషి ఇతనే అయి ఉంటాడనుకున్నాడు మంగేష్‌రావ్.

అతని ప్రశ్న మంగేష్‌రావ్‌కి విచిత్రంగా తోచింది. బహుశ, ఈ ముసలివాడి మతి స్థిమితంగా లేదేమో అనుకున్నాడు. అయినా మర్యాదకోసం, 'బలే చిక్కు ప్రశ్న వేశారే! మీ ఊరేమిటి ఎండిపోవటమేమిటి? చాన్ని చూస్తుంటేనే ఆకలిదప్పులు తీరేట్లుంది! ఇక ఈ చెరువు – ఎంత అందంగా ఉంది!' అన్నాడు.

ముసలి రైతుకి కోపం వచ్చినట్లుంది. 'అన్నన్నను, అంగంగా ఉందా మీకు? ఏంటేంటి, చూస్తేనే ఆకలిదప్పులు తీరిపొయ్యేయా? బాబూ, ఈ అందమయిన చెరువు మూలకంగానే మేము చూడి చస్తున్నాం! మా పొట్లు చూసి సంతోషించే వారి కళ్లు పాపపు కళ్లు...! సంతోషమా?! పుండు మీద కారం చల్లినట్లుంది... భగవంతుడు మీ పరాచికాలని చూడండి! ఆహాహా! చెరువందంగా ఉందీ...' మాట్లాడుతున్న కొద్దీ వృద్ధుడి కోపం అధికం కాజొచ్చింది. బొమలు ముడిచాడు, మెడ వణికింది.

సాధారణంగా శాంతంగా ఉండే మంగేష్‌రావు ముఖకవళికలు అతని ధోరణికి అతివేగంగా మారిపోయాయి. కాని కొద్దిసేపట్లో తేరుకున్నాడు.

'ఏమిటయ్యా అంతకోపం వచ్చింది మీకు? నేనేమన్నాను? రిపబ్లిక్ సంవత్సరంలో బొంబాయి వెళ్లిపోయ్యాను—అది 1910 మాట! గోవాకి మళ్లీ పదిహేనేళ్ల తర్వాత తిరిగి వస్తున్నాను...' అని కొన్ని క్షణాలు ఆగి తిరిగి ఇలా చెప్పుకుంటూ పోయాడు! 'అసలు మీ ఊరికి రావటం నాకిదే మొదటిసారి! మీ బాధలు నాకేమి తెలుస్తాయి చెప్పండి? తెలీక మీకు కష్టం కలిగిస్తే మాత్రం మన్నించాలి ... బుద్ధిపూర్వకంగా ఏమీ అనలేదు!'

మంగేష్‌రావ్ మాటలు వినగానే ముసలి రైతు కోపం బాగా తగ్గిపోయింది. దారికి వచ్చే ధోరణిలో, 'అట్లాగా బాబూ? మా ఊరిని గురించి మీకేం తెలీదా? క్షమించండి! మాకు మా భూముల సంగతి తప్పితే వేరే ఏమీ తెలీవుగదా ... చాలా కష్టాల్లో ఉన్నాం! తప్పయితే మన్నించండి!' అన్నాడు.

చెట్టుదిగి వచ్చేసి మంగేష్‌రావ్ ఎదురుగా నుంచున్నాడు. ఇంకా ఇలా చెప్పుకు పోయాడు దీనంగా—

'నా కెనబయ్యేళ్లు నిండాయుంటాయి. ఏమో. అయిదిటో అటో ఉండాయేమో ఎవరికి తెలుసూ? కాని బాబూ! నా బతుకులో ఇంత చెడ్డరోజులు చూడలేదంటే నమ్మండి—నలబయ్యేళ్లకింద మిడతలదండు వచ్చినప్పుడు తప్ప. అంటా నిగ్గింజలేదు. ఆ మిడతల గుంపులు ఆకాశాన్నే పంపి సూరుడిని కప్పేశాయి. ప్రపంచం మీద పెద్ద గొడుగు కప్పినట్టయిందంటే నమ్మండి! ఆ యేడు మా పంటంతా నాశనమయింది... ఆ మిడత లొక్క గడ్డిపోచని వదల్లేదు! అదేంటోగాని అప్పుడు కూడ ఇంత బాధపడలేదు...ఎలాగో కాలం గడిపేసాము. దేవుడిదయవల్ల రోజులు మారి మా కష్టాలు గట్టెక్కాయి ... వాటిని మరిచేపోయాం కానయితే, ఈ రోజు మా కష్టాలు దేవుడి శాపం మూలకంగా వచ్చినవి కావు! అవి మనుసులు తెచ్చిన కష్టాలే!—

'బాబూ, అయిదుసంవత్సరాలుగా ఎందరు చూడిపోతున్నారో చెప్పలేను... మా గొడ్లు మా కళ్లముందే చస్తున్నాయి గడ్డిలేక! అంతా తమరు పొగిడిన ఆ చెరువు మూలకంగానే...!'

'ఏమిటీ? ఆ చెరువువల్లనా?' మంగేష్‌రావ్ ఆశ్చర్యపడ్డాడు.

'అవును బాబూ, అవును! ఆ చెరువే!' అని జవాబు ఇచ్చాడు ముసలి రైతు. 'అయిదేళ్లకిముందు అక్కడ చెరువులేదు. అదంతా ఒక పెద్ద 'ఖాజన్' (ఉప్పునీటితో కలిపి సాగుబడిచేసే పొలం రకయిత). మా ఊరికి లచ్చమణుగుల వరి ఇచ్చేది! మా తాతముత్తాతల కాలంకాడినుంచి రైతులమంతా సొంతంగా సాగుబడి చేసుకునేవాళ్లం. మా చెమటోడ్చి చేసిన ఆ సేద్యం మా కడుపులు నింపింది– మా ఆలిబిడ్డలకి కాస్త గంజిపోసింది! ఎన్నో ఏడవలు చేతులు మారిందంటారు గానయ్యా, దేసాయ్‌లనే దొరల తాతగారు దీన్ని కొన్నారు. అప్పుడి నుంచి వారి కుటుంబంలోనే ఉంది...

'అంతకిముందు ఒకబాగం నో సావుకారు గారిదీ మరోబాగం నో పంతులిదీ–వాళ్ళే మా పొలాల్ని ఎవరో సేపలుపట్టే మనిసిదగ్గర కొన్నారని మా తాత సెప్పేవాడు... ఈ సేపల మనిసి బాగా డబ్బున్నవోడు, అతనికో నావ కూడా ఉండేదిట బాబూ! ఇంతకి నే సెప్పేదేంటంటే, ఆ నావ సొంతదారుకాడి నుంచి ఈ నాటిదాకా సాగుబడిసేసింది మేమే మా నాగలి తప్ప దున్నలేదీ గడ్డని! అందుచేతనేగదు బాబూ దసరా సంబరాల్లో అమ్మవారికి మొదటి టెంకాయ కొట్టేది మా కుటుంబం? బాపనయ్యల పూజలు కూడా మా టెంకాయ కొట్టింతర్వాతనే కదూ?'

'అలాగా?' అన్నాడు మంగేష్‌రావ్ చిరునవ్వుతో. అతని చిరునవ్వుతో ప్రతిబింబించిన సానుభూతి, సహృదయత వృద్ధుడికి ఎంతోసంతోషం కలిగించాయి.

అమ్మవారి మాట రావటం, కొబ్బరికాయ కొట్టటం గుర్తుకి రావటం వృద్ధుడి హృదయంలోని భక్తి భావాలని మేదిపాయి. వయసు మళ్లిన అతని కళ్లలోకి ఏదో వింత కాంతి వచ్చింది. దేవాలయం వంక చెయ్యిజాపి కొద్ది క్షణాల తర్వాత కొద్దిగా వణికే గొంతుకతో మళ్లీ చెప్పటం ప్రారంభించాడు.

'కానయితే అయ్యా, ఈ గవురసం సాలు కొకసారి మాత్రమే దక్కుతుంది మాకు. మిగతారోజుల్లో మా వంక దిక్కు కూడా సూడదు కదా! అందుచేతనే ఈ బాదలు మాకు...'

'ఇప్పటి యజమానుల తాతలనాటి వేవారానికీ నేటి వేవారాలకీ ఎంత తేడా ఉంది... ఆ దినాల్లో ఆవాగు పొలాలన్నిటిలోకి పారేది! ఆటు, పోటు నీటిని చెక్కలతో పటిసేవాళ్లం. అంతా బలేబాగా సాగేది. ఈ కట్ట ఎంత గట్టిగా ఉండేదంటే పున్నమనాడూ, అమావాస్యనాడు కూడా ఖజన్‌లో

నీరు నేరిగ్గా ఉండేది. అయిదేళ్ల మునుపు ఇదంతా మారిపోయింది. కట్ట తెగి ఉప్పు నీరంతా చేలలోకి పారింది. మంచి ఖాజన్ ఆ దరిద్రపు గొట్టు సెరువయిపోయింది! అసలు కట్టకి పడ్డగండి చాలా సిన్నది. అప్పుడే కట్టేసుంటే అంతా సరిగ్గా ఉండేది ... కాని, బాబాసాయెబ్, రావు సాయెబ్బుల మద్దెన కొట్లాట వచ్చేసింది.'

'ఇద్దరూ అన్నదమ్ముల బిడ్డలు. బాబా సాయెబు తండ్రి ఇద్దర్లో పెద్దారు. ఈ ఖాజన్ ఇద్దరి సొమ్మూ! బాబూ, మొదట్లో అందరూ సుకంగా కలిసుండేవారు రెండు కుటుంబాలు పెద్దయ్యగారింట్లోనే ఉండేవారు ఈ మద్దెనే కదా రావు సాయెబుగారి కుటుంబం ఆ కొత్త ఇంటికెళ్లింది? విడిపోయినతాలనుంచీ ఇద్దరి మధ్య కొట్లాటలు పెరిగిపోయినాయి. పంట పంపకంలో వచ్చింది పిక్కు! ఈ కోపంతో గండి పూడవటం మానేశారు. ఇంకేంది, కట్ట బాగా గండిపడిపోయింది. సముద్రం పోటు వచ్చినప్పుడల్లా ఉప్పునీరు లోపలికొచ్చేస్తది. ఈ సెరువు మీ కళ్లకి సక్కగా ఉందంటరు! అయిదేళ్లముందు వచ్చుంటే మీ కళ్లకింకా చక్కటిది కనిపించేది బాబూ!! ఉప్పునీటిలో పెరిగే ఈ దరిద్ర గొట్టు 'ఇంపల్', 'చిపీ' పొదల బదులు సేనా సక్కని వరిచేను సూసేవారు! ఈ చోటంతా గొడ్ల మందలు మందలుగా మేసేవి బాబూ ... ఎంత పచ్చికుండేదో ఇక్కడ తెల్సా? ఇప్పుడు వాటికీ సెత్తమేపాలొచ్చింది...

'బాబూ అకాలంలో ఈ సోటంతా కూలిజనంతో, పిల్లల్తో, ఎడ్లబళ్లతో కిటకిట లాడిపొయ్యేది ... సాలు పొడుగుతా ఏదోపని సూసుకునేవాళ్లం...'

భావావేశంతో చెప్తున్న వృద్ధుడి మాటలకి మంగేష్‌రావ్ అడ్డురాకుండా ఉండలేకపోయాడు.

'అయ్యో పాపం మీవాళ్లకిది పెద్ద నష్టమేనే. మరి మీ భూస్వాములకి కూడా నష్టమేకదా, కట్టనెందుకు బాగు చెయ్యరూ?' అని అడిగాడు సానుభూతి ఉట్టిపడేట్టు.

ముసలి రయితు ఈ ప్రశ్నవే ఎదురు చూశాడు. కనుబొమలు పైకెత్తాడు. 'తెలుసుకుంటే సెయలేని పనా బాబూ వారికది? ఆ కోర్టుల్లో తగువులకి కర్చుచేసిన దాంట్లో పదోవంతు పెట్టినా సరిపోయేది. వారంలో గట్టు బాగుచేసేవాళ్లం. కాని, తగ్గేదెవరు? వాళ్ల మధ్యనపడి మేము మునిగిపోతున్నాం.' అన్నాడు. 'అంతేకాదు బాబూ! మాలాంటోళ్లకి ఇది తప్ప బతుకు తెరువులేదు. వాళ్లు మహరాజులు! ఎలాగయినా గడుస్తది. ఎంత కర్చయినా పెట్టుకుంటారు. పట్టినపట్టు ఇడవరాదని పంతం! రెండు ఎనుబోతులు గుద్దుకుంటూంటే మధ్యపడిన సెట్టుగతేం కావాల?'

ఇంతలో పక్కనే ఉన్న ఒక కొబ్బరి తోపులోనుంచి వారికి అరుపులు, పాటలు వినిపించాయి. ముసలివాడు ఒక క్షణం అటువయిపు తల పంకించి శ్రద్ధగా విన్నాడు. తర్వాత, 'సూశారా, మేమేమో ఇక్కడ తిండిలేక మాడి సస్తావుంటే ఆ ఉత్తరాది ఆబోతులు ఎలా మెక్కుతున్నారో? ఆ తోపులో కాయలన్నీ వాళ్లకే! ముందు రోజుల్లో మేము కాపలా కాసినప్పుడు ఒక పుల్ల పోనిచ్చేవాళ్లమా?' అన్నాడు ఆవేశంతో. ఇక చెప్పలేక చిన్న మూలుగుతో నేలమీద కూలబడ్డాడు 'ఇప్పటి వెవ్వారమే వేరు, రోజులు మారాయి' అని వాపోయాడు.

'ఈ ఉత్తరాదివాళ్లు మీ గ్రామానికెలా వచ్చారు?'

'సెబుతున్నాగదు బాబూ... కామందుల మద్దె కొట్లాటలు ఎక్కువయిపోయినాయి. మొదట్లో పనివాళ్లు, కూలీజనం తగువులాడుకునేవాళ్ళు ఆర్నెల్లకితం రావుసాహెబ్ గారి పని పట్టించాలని పెద్దాయన ఈ పూర్‌భయ్యా (ఉత్తరప్రదేశ్‌నుంచి వచ్చిన వారిని ఇలా పిలుస్తారు) మూకని తెప్పించారు. బొంబాయి నుంచి వచ్చారుట వీళ్లంతా! కుక్కల్లాగ తిండి పడేసినవారి జిట్టుంటారు పాలు, నెయ్యి, పంచదార, పూరీలు తెగమేసి ఊగమీద పడ్తారు. వారి పాలకం సూడాలి బాబూ - మీరు— సొక్కా సేతులు పయికి మడిసి ఎదుటి మనుసులతో జగడానికి దిగుతారు ఇదే వాళ్ల ఉద్యోగం! వేరేలేదు. సరే రావుసాహెబ్‌గా రూరుకుంటారా? బొంబాయినుంచి పటాన్లని తెప్పించారు!'

'ఏమిటీ, దేశ్‌పాండే లాంటి గొప్ప కుటుంబంలోవారు ఇంత నీచానికి దిగారా?' మంగేష్‌రావ్ ముఖంలో ఆవేదన కనిపించింది.

'తమ రయితులకోసమయినా ఈ పోట్లాటలు మానుకోవచ్చునే! వాళ్లేమిటి మనుషులా, రాక్షసులా! లక్షణమయిన ఖాజన్ ఇలా ఉప్పునీటితో నాశనమయిపోతూ ఉంటే, ప్రజలు మాడుతూ ఉంటే-చూస్తూ ఊరుకుంటున్నారు!'

మంగేష్‌రావ్ మాటలు ముసలి రయితుకి కోపాన్నీ, సంతృప్తినీ రెండిటినీ కలిగించాయి. తమ బాధలని చూసి జాలిపడుతున్నాడని సంతృప్తి; తమ భూస్వాములని దూషిస్తున్నాడని కోపమూ. కొంచెం తికమక పడ్డాడు.

'అదేంటి బాబూ అలా గంటారు?' అన్నాడు.

'మా కామందులు మేమంతా మాడి సావలని కోరుకుంటున్నారా? వాళ్లుమట్టు కేంజేస్తారు? వారి పంతాలు, పట్టింపులు వేరు! పరువుకోసం ఎంత దూరమయినా పోతారు. మాలాటి దెరిద్రులు పొట్టకోసం ఇలా పాకులాడుతా ఉంటాము ... వాళ్ళ కష్టాలు వాళ్లకుంటాయి. కోర్టు వెవారాలంటే మాటలా ఏటి? మాబోటి సదువు రానివారికివన్నీ ఏం తెలస్తాయి?...

వృద్ధుడి ధోరణిలో హఠాత్తుగా కలిగిన ఈ మార్పు మంగేష్‌రావ్‌కి ఆశ్చర్యం కలిగించింది. అతని విశ్వాసానికి చిరునవ్వు నవ్వుకున్నాడు. ఇంతలోనే ఈ కబుర్లు వింటూ ఎంతో కాలం వృధాచేసినట్లు గ్రహించి,

'సరేలే అన్నా! అట్లాగే కానియి. మీ కామందులది తప్పయినా కాకపోయినా దేవుడున్నాడుగా పయిన! అంతా సరిచేస్తాడు చూస్తూ వుండు...'

'మీ నోట చక్కెర పొయ్యాలి బాబూ!' ముసలిరయితు మాటల్లో ఎంతో కృతజ్ఞత ఉంది.

'మీ కామందు బాబాసాహెబ్ దగ్గర కెళ్లాలి దారెటు?'

ఈ ప్రశ్న మంగేష్‌రావ్ ఎంతో సాధారణంగా వేసినా వృద్ధుడికి అతనిమీద గౌరవభావం అధికం అయేట్టు చేసింది.

'నిజంగా మీరు మా అయ్యగారింట్లో దిగుతున్నారా బాబూ? ముందే చెప్పకపోయినారా! రండి బాబూ రండి, తీసుకెడతా-'



## పెద్ద పెద్ద ఆశయాలున్నాయి
## ఉత్సాహముంది
## వృద్ధిలోకి వస్తున్నాడు
## అతడి సైకిలు ఫిలిప్స్

ఫిలిప్స్ దిట్టంగా ఉంటుంది ఎంత చెడ తొక్కినా తట్టుకొనేటట్టు మంచి ట్రూ టెంపరు స్టీలుతో తయారైంది. దాని అంద చందాలు గంభీరత కూడా మీ సంస్కృతిని బాగా తెలియజేస్తాయి. మీవంటి యువకులకు తయారుచేయబడిన విశిష్టమైన బైసికిలు.

ఫిలిప్స్ మీరు వాడదగిన సైకిల్





Ⓡ
జె. ఎ. ఫిలిప్స్ కంపెనీ లిమిటెడ్ యు కె వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్కులు. ఇండియాలో తయారుచేయువారు: టిఐ సైకిల్స్ ఆఫ్ ఇండియా. అంబత్తూరు. మద్రాసు-53 ప్రొప్రైటర్లు ట్యూబ్ ఇన్వెస్ట్‌మెంట్స్ ఆఫ్ ఇండియా లిమిటెడ్. మద్రాసు-1 ఉపయోగించుటకు రిజిష్టరు కావింపబడినవి. చిన్న మొత్తముల సేకరణలో ఆదాచేయండి.

T.I.C/P/3820a

® ఫిలిప్స్

అంటూ మంగేష్‌రావ్‌ని తీసుకువెళ్లాడు. 'మా అయ్యగా రెంతో సంతోషిస్తారు ... మీది బొంబాయా బాబూ? నాల్రోజు లుంటారా?'

'అంతకన్నా భాగ్యమా? బాబాసాహెబ్‌తో నాలుగురోజులు గడపటంకన్నా మంచి పనే ముంది? కాని ఈ సాయంత్రమే నేను తిరిగి వెళ్ళిపోవాలి. ఈ ఊళ్లో ముఖ్యమైన వనొక టుంటే చూసుకుపోదామని వచ్చాను.'

'ఏంటీ – ఇయాలే తిరిగెళ్లిపోవాలా?' వృద్ధుడు నవ్వుకున్నాడు. 'అదెప్పుడయినా జరిగేపనే? మా బాబాసాయెబ్‌గారింట్లో ఒక వారంరోజులయినా ఉండోపోతే ఆయ నొదుల్తారా? ఏదో రెండుగంటల్లుండి తిరిగి పోతానంటే బాబాసాహెబ్ వప్పుకోనే వప్పు కోరు! నే సెప్పింది నిజవో కాదో మీరే సూస్తారుకద బాబూ!'

ఇద్దరూ బాబాసాహెబ్ యింటిదగ్గరికి రావటంతో ముసలివాడు తన సంభాషణ అంతటితో ఆపివేశాడు.

* * *

అదొక పెద్ద రెండంతస్థుల రాతిమేడ: ఇంటిచుట్టూ పెద్ద తోట; తోటలో ఒక వయిపు విశాలమయిన గొడ్లసావిడి, దాని పక్కనే గుర్రపుశాల. అంత పెద్ద సావిడి లోనూ మూడు నాలుగు గొడ్లకన్నా కని పించలేదు. గుర్రపుశాలలో గుర్రం లేదు కాని తుప్పు పట్టిపోతున్న బండీ, దుమ్ము కొట్టుకుపోయిన పల్లకీ ఒకటీ మాత్రం ఉన్నాయి. నేలమీద కొబ్బరిచిప్పలు, కట్టెలు, కుళ్లిపోతున్న గడ్డివాములూ చిందరవందరగా పడిఉన్నాయి. ఈ సావిడి ఉన్న అవతలవయిపు మామిడీ, పనస, జామచెట్లు; వాటిమధ్య అక్కడక్కడ మారేడుచెట్లు, తులసిమొక్కలు; ఒక పక్కగా వెదురుపుల్లల కంచె మధ్య పోర్చు గీసు వారు ప్రవేశపెట్టిన ఆధునిక పద్ధతిలో పూలతోట వెయ్యాలని ప్రయత్నం చేసినట్లు సూచనగా కనిపించే విరిగిపోయిన మట్టిపూల తొట్టెలు; మంగేష్‌రావ్ మేడ వయిపు చూశాడు. ఇంటి కుడివైపు ఒక వైపు ఒక మూల సగం కట్టిన బాల్కనీ కనిపించింది.

పోర్టికోలోకి కాలుపెట్టగానే అక్కడే ముడుచుకుని పడుకుని ఉన్న ముసలికుక్క ఒకటి గుర్రుమన్నది. ఇది విన్న పనిమనిషి ఒకతను బయటికి వచ్చాడు. మంగేష్ రావ్‌ని సవినయంగా పలకరించి లోపలికి తీసుకు వెళ్లాడు. యజమానిని పిలుచుకురావటానికి లోపలికి వెళ్లాడు. అది ఒక పెద్ద హాలు. నేలమీద పండటానికి గడ్డిలో పెట్టిన మామిడికాయలు చాలా ఉన్నాయి. ఒక మూలగా కొన్ని కుర్చీలు, సోఫాలు ఉన్నాయి. పైన దూలాలమీద కూర్చునిఉన్న పావు రాలు వాటిని బాగా ఖరాబు చేసివేశాయి. మంగేష్‌రావు జాగ్రత్తగా ఒక సోఫా అంచు మీద కూర్చున్నాడు. అది తక్కినవాటికన్నా కొంచెం శుభ్రంగానే ఉన్నా అందులో అప్ప టికే ఒకపిల్లి, దాని కూనలు పడుకుని ఉన్నాయి. పిల్లికూనలు పాలకోసం ఎగబడు తున్నాయి.

చూరుమీద నుంచి దీపాలగుత్తులు వేళ్లాడుతున్నాయి. మంచి శిల్పంకలవే, కాని శిథిలావస్థలో ఉన్నాయి. గోడలకి తగిలించి ఉన్న పొడుగాటి నిలువద్దాలు మాసి పోయాయి. వాటిపక్కనే వేళ్లాడుతున్న కత్తులు తుప్పుపట్టిపోతున్నాయి; ఈటెలు, తుపాకులూ కూడా అంతే. ఆ హాల్లోని పటాలుమాత్రం మంచి స్థితిలోనే ఉన్నట్లు కనిపించాయి. అవి చాలామట్టుకు వర్ణ చిత్రాలు, ఛాయాచిత్రాలు దేవీ, దేవతల బొమ్మలు గాజుమీద వేసినవి. ఒక్కొక్కటి కనీసం వంద సంవత్సరాల కిందయినా వేసి నదే. ఛాయాచిత్రాలలో ప్రముఖంగా కని పించేవి పోర్చుగల్ ఏలిన చివరిరాజులు దోన్ కార్లోస్, దోన్ మాన్యుయెల్ లవి; వారి తర్వాత వచ్చిన ప్రజాస్వామ్య నాయకులు దకొతూర్ మాన్యుయెల్ ద అరెయుగా, దకొతూర్ అల్మెయిదాలవి. వాటిని చూడ టంలో మునిగిపోయిన మంగేష్ రావ్‌ని ఒక లావుపాటి వ్యక్తి వచ్చి చిరునవ్వుతో పలక రించాడు. అతనే బాబాసాహెబ్. మంగేష్ రావ్ తనని పరిచయం చేసుకున్నాడు. ఇంతలో ఒక పనిమనిషి 'హుక్కా' తీసుకు వచ్చి అతిథికి ఇచ్చాడు. మంగేష్‌రావ్‌కి పొగ తాగటం అలవాటులేదు. బాబాసాహెబ్ నవ్వుకున్నాడు; హుక్కాని తీసుకుని కొన్ని గుక్కలు పీల్చాడు. పనిమనిషికి తిరిగి ఇచ్చేస్తూ, ఆడవారితో అతిథికి టీ తయారు చెయ్యమని చెప్పమన్నాడు. టీ వచ్చేలోపల లేత కొబ్బరిబొండాల నీళ్లు తీసుకు రమ్మన్నాడు.

మంగేష్‌రావ్ తన తాతగారికీ, బాబా సాహెబ్ పెదనాన్నగారికీ కల స్నేహంగురించి చెప్పుకున్నాడు. ఇద్దరూ జూదగాళ్లే. బాబా సాహెబ్‌లో ఎన్నో జ్ఞాపకాలు మెదిలాయి. మంగేష్‌రావ్ భుజంమీద చెయ్యివేసి, 'భలే వారే! భవానీ బాబా మనవలా! ఆహా, ఎంత మంచివాడతను! అతనంటే మాకందరికీ ఎంత గౌరవం, ఎంత అపేక్ష...అసలు పరాయివాడికిందే అనుకునేవాళ్లం కాదే...! ఏటా దసరాకి మా యింటికి వచ్చేవాడు. రెండు నెలలుండి వెళ్లేవాడు...ఇక ఆరెండు నెలలూ ఒకటే జూదం, ఒకటే జూదం; మా పెదనాన్నా, ఆయనా! పగలూ రాత్రీ తెలిసేదికాదు వాళ్లిద్దరికీ... భవానీ బాబా ఉంటే మా పెదనాన్నకి ఎంతో ధైర్యం! ఎటువంటి జూదగాణ్ణయినా సవాలుచేసే వాడు...! వంటిమీద బట్టల్నికూడా వదల కుండా దివాలా ఎత్తించేవాడు...' బాబా సాహెబ్ ఆ జూదగాళ్లద్ద ప్రతాపాలని గురించి చెప్పుకుపోయాడు. గోవాలో వాళ్లు చూసిన ప్రతి జూదరు కొంపని గురించీ చెప్పాడు. అయితే ఈ వర్ణనలు పని మనుష్యులు తీసుకువచ్చిన కొబ్బరి బొండాల నీరు తాగటానికిగాని, తర్వాత వచ్చిన టీ, మిఠాయిలు ఆరగించటానికీ గాని అడ్డురాలేదు. తన అతిథిని కూడా మొహమాట పడకుండా తినమని మధ్య మధ్య హెచ్చరిస్తూనే వున్నాడు. ఇదంతా పూర్తి అయేసరికి గంట పట్టింది.

'నిజమేనండీ! భవానీబాబా భలేమనిషి... అతని సాహసం మూలంగానే మా పెద్ద నాన్న ఆ రోజుల్లోనే గోవాలో అంత పెద్ద జూదరనే కీర్తి సంపాదించుకున్నాడు!' అని పూర్తిచేశాడు చివరికి.

మంగేష్‌రావ్ తను వచ్చిన పనేమిటో చెప్పటానికి ప్రయత్నించాడు రెండు మూడు సార్లు. కాని అతని ప్రయత్నాలు బాబా సాహెబ్ అభినయాలని, నవ్వుని, కథనాన్ని ఆపలేకపోయాయి. పనిమనిషి ఒకడు కొబ్బరి నూనెగిన్నెతో వచ్చేదాకా బాబాసాహెబ్ వాగ్ధోరణికి అడ్డులేకపోయింది. పనివాడు కొబ్బరినూనె అతనిముందు వుంచి పేజ్ (పొద్దున ఫలహారం)కి వేళ అయిందని గుర్తు చేశాడు. బాబాసాహెబ్‌కి అతిథి మర్యాద

మరొకటి ఉందనీ జ్ఞాపకం వచ్చింది.

నూనెగిన్నె మంగేష్‌రావ్‌కిచ్చి పైవంటి మీద చొక్కా తీసివేశాడు ఇద్దరూ వంటికి నూనె పట్టించుకోవటం ప్రారంభించారు. (స్నానాలో స్నానం ముందు నూనె రాసుకోవడం అలవాటు) ఇంతలో పిల్లి ఏనాన ఒకటి అమాంతంగా మంగేష్‌రావ్ వీపు మీదకి దూకింది కంగారు పడిపోయిన మంగేష్‌రావ్ నూనె గిన్నెని తోసివేశాడు. నూనె అతని ధోవతి మీదంతా వలికింది. బాబాసాహెబ్ జరిగినదానికి క్షమాపణ చెప్పుకున్నాడు. పని మనిషిని కేకలువేశాడు 'శానో, నీకసలు బుద్ధి ఉందా లేదా? పావురాళ్ళూ, కాకులూ, పిల్లులూ, ఎలుకలూ అన్నీ పెంచి మా ప్రాణాలు తీస్తావు! ఇది దేష్పాండేల 'డ్రాయింగ్ రూమ్' అని నీకు తెలీదా? ఇక్కడికి ఎంతమంది యూరోపియన్ అధికారులు వచ్చారు? వాళ్ళందరూ వచ్చి కూచున్న ఈ గదిని నువ్వొక గొడ్లసావిడి చేసేస్తున్నావ్!'

బాబాసాహెబ్ మాటలు చురుకుగానే ఉన్నప్పటికీ పిల్లికూన వంక చూసినప్పుడు అతని కళ్ళల్లో ఉట్టిపడే వాత్సల్యం మంగేష్‌రావ్ గమనించకపోలేదు ఈ సంఘటన వల్ల ఇంకా ఏమి ముంచుకువస్తుందోనని లోపల కొంచెం అదుర్దా చెందాడు.

ఇద్దరూ స్నానాలు ముగించుకుని, కొత్త బట్టలలోకి మారారు వంటింట్లోకి వెళ్ళి పీటలమీద కూర్చున్నారు. విందు చెయ్యబోతున్నట్లు మంగేష్‌రావ్ గ్రహించాడు... అతని ముందు పెసట్‌తోబాటు, మెత్తటి అట్లూ, సాంబార్, అప్పడాలూ, పచ్చళ్ళూ, ఊరగాయలూ సిద్ధంగా ఉన్నాయి.

కబుర్లు ఎంతసేపైతే తిండి అంతబాగా జరుగుతుందని బాబాసాహెబ్ నమ్మకంలాగ ఉంది. ఫలహారం చేస్తూ చెప్పుకుపోయాడు: 'అసలు శానో వాడిపేరు కాదు తెలుసా? వాడికా పేరు మా అమ్మ పెట్టింది వాడంటే ఆవిడకి ముద్దు! ఏడేళ్ళ కుర్రవాడుగా మా ఇంటికి వచ్చాడు—తల్లిదండ్రులు లేరు అసలా పేరేమిటి! 'శానో' (అంటే తెలివిగలవాడు) అని ఈ బుద్ధిలేనివాడిని పిలవటమా?' బాబాసాహెబ్‌కి నవ్వు ఆగలేదు. కథ చెప్పటం ఆపవలసివచ్చింది. తేరుకున్న తర్వాత ఫలహారం కొంత పుచ్చుకున్నాడు. ఈ పని ముగించిన తర్వాత శానో తెలివితక్కువ ప్రతాపాలని గురించి అరగంటసేపు చెప్పాడు. అప్పటికి తిండి పూర్తి అయింది. బాబాసాహెబ్ తన అతిధిని కాసేపు కునుకు తియ్యమని పడక గదిలోకి తీసుకువెళ్ళాడు. పడుకునేముందు, 'అంతా విన్లేదు మీరు! ఈ శానోగాడికి పెళ్ళి చేయించాను—అయిదు వందలు ఖర్చుచేసి—అవును, అయిదువందలు! కాని ఏం లాభం?' అని విరగబడి నవ్వాడు. 'అంతా గందరగోళం—పెళ్ళాన్ని తెగ గారాబం చేశాడు. ఏముందీ, ఆ పిల్ల ఏడాది క్రితం వీడిని వదిలి పుట్టింటికి వెళ్ళిపోయింది తిరిగిరాదుట—ఎంత అవమానం!'

బాబాసాహెబ్‌కి నిద్ర వస్తోంది. రోజూ ఆవేళకి ఒక కునుకు తియ్యటం ఆయనకి అలవాటు. కాని, కథ చెప్పటం పూర్తికాలేదేమో ఇంకా మాటాడుతూనే వున్నాడు. 'బాబూ శానో పెళ్ళాన్ని యింటికి రమ్మని కబురు పెడితే ఏమందో తెలుసా? నాకు బంగారు గాజులు చేయించు, తిరిగివస్తా, అంది.' ఏమిటి విపరీతం? గొడ్లకాసేవాడి కూతురికి బంగారుగాజులేమిటి? కాని, ఈ వెర్రివెధవని గాజులు పెట్టమంటుంది! నేనేమో వాడితో, 'పెళ్ళాం పోతే పోయింది. మళ్ళీ పెళ్ళిచేస్తా, భయపడకు!' అన్నాను. వెయ్యిరూపాయిలు ఖర్చయినా సరే ఫర్వాలేదన్నాను! అప్పుడేంచేస్తుందా పిల్ల?'

మంగేష్‌రావ్ తను వచ్చిన పని గురించి చెబుదామని ఎంత ప్రయత్నించినా బాబాసాహెబ్ చెప్పనివ్వలేదు. పోనీ, ఇంత సంతోషంగా వున్నాడు. ఇప్పుడు చెప్తే వింటాడేమో అని, 'బాబాసాహెబ్‌గారూ, మిమ్మల్ని పొగడుతున్నాననుకోకండి, కాని యింట్లో పని మనుషుల దగ్గరే ఇంత దయ చూపిస్తున్నారంటే అది మీ వంశ సాంప్రదాయానికీ తగినదే కదా! ఇందరికీ సాయం చేశారు, నా కోరిక కూడా వినండి. మీతో పని పెట్టుకుని ఇంత దూరం వచ్చాను' అన్నాడు.

బాబాసాహెబ్‌కి నిద్ర ముంచుకువస్తోంది. ఈ ప్రశంస విని సంతోషించినా ఇక మాట్లాడే ఓపిక లేక మంగేష్‌రావ్ మాటని నవ్వుతూ తోసివేశాడు. 'భయపడకండి! మీరంత పని కట్టుకొస్తే, అదేమిటో పూర్తికానిదే పంపించేస్తానా ఏమిటి నేను! ఇది దేష్పాండే ఇల్లు ఏమన్నానా? మీరు చెప్పటమే తరవాయి నేను దాన్ని తీరుస్తాను. అవునుగాని, ఇంత ఎండలో నడిచి వచ్చారు కాసేపు కన్ను మూస్తే మంచిది. తర్వాత అన్నీ మాట్లాడుకుందాంలే...' ఈ విధంగా అతిధి తొందరపాటుని అతి మర్యాదగా నెట్టివేసి, మరొకసారి నిద్రపొమ్మని చెప్పి బాబాసాహెబ్ తనూ కన్ను మూశాడు. చిటికలో గుర్రుపెట్టటం ప్రారంభించాడు.

మంగేష్‌రావుకి పగలు నిద్రపోవటం అలవాటు లేదు. బాబాసాహెబ్ ఇలా గుర్రుపెట్టి నిద్రపోతూ ఉంటే తనేమిటి చెయ్యాలో తోచలేదు.

కలతగా రెండుగంటలు గడిపాడు. బాబా

(63 వ పేజీ చూడండి)

హోటల్లో తిన్న 'అన్నం' అరగడం లేదని పరుగెడుతున్నా!






# ఆశా మగువల అందమునకు మెఱుగులు దిద్దును

ఆశా స్నో మరియు పౌడరును ఉపయోగిస్తే మీ ముఖ వర్చస్సు సొగసుగా, సహజముగా వెలుగొందును. వీటితో మీ ముఖ చర్మమును మృదువుగా మనోహరముగా చేసుకోండి.

నల్లని ఆకర్షణీయమైన మీ కళ్లకు ఆశా కాటుకను కనురెప్పలకు దిద్దుకోండి. కారునలుపైన ఆశా కాటుక మీ కళ్లకు చల్లదనమును హాయిని యిస్తుంది.

ముస్తాబు పూర్తి చేయుటకు ఆశా కుంకుమతో బొట్టు పెట్టుకోండి. ఇది దీప శిఖవంటి ఎరుపు, ముదర ఎరుపు, నలుపు, మూడు రంగులలో లభించును.

ఫేస్ పౌడరు • స్నో • కాటుక • కుంకుమ



Asha







V-13-Tel




# మల్లన్న మంత్రి

## కౌటిల్య

ఒకప్పుడు రాజు, మల్లన్న మంత్రి కొద్దిమంది భటులతో కలసి వేటకు వెళ్లారు. వారందరూ మధ్యాహ్నంవరకు అడవిలో వేటాడి తరువాత ఒక సెల యేటిగట్టున విశ్రాంతి తీసికొన్నారు. సాయంత్రం కాగానే అందరూ అక్కడ నుండి బయల్దేరారు.

ఆ సెలయేటికి సమీపంలోనే ఒక పెద్ద నుయ్యి ఉంది. రాజు, బయలు దేరి వస్తూ ఆ నూతిలోనికి తొంగి చూశాడు. రాజు బాగా వంగిచూడడం వలన తలమీద నున్న పాగా నూతి లోనికి పడిపోయింది. అప్పుడు భటుల పాగాల నన్నింటినీ ఒకదానికి మరొకటి ముడివేశారు. ఆ తలపాగాలను పట్టు కొని ఒక భటుడు నూతిలోనికి దిగడం ప్రారంభించాడు. ఆ భటుడు సగందూరం దిగేనరికి ఆ తలపాగాలు తెగిపోయేయి. భటుడు నూతిలో పడి పోయాడు. అయినా, లోపల నీరు ఉండడంవలన భటుడికి దెబ్బలు తగల్లేదు. భటుడు నూతిలోపల యీదుతూ ఉన్నాడు.

ఆ భటుణ్ణి పైకి తీయడానికి తాడు వగైరా యేమీ వారివద్దలేదు. పోనీ యేదైనా ఒక చెట్టుకొమ్మ తెగ కొట్టి అందించడానికి నుయ్యి చాలా లోతుగా ఉంది. అందుచేత అటు వంటివి యేమీ పనిచేయవు. పట్నం వెళ్లిరావడానికి చాలా సేపు అవుతుంది. ఆ రాత్రికి వారు అక్కడ ఉండిపోవడం మంచిదికాదు.

ఈ పరిస్థితిలో యేమి చేయ డానికి తోచక రాజు మల్లన్న మంత్రి వైపు చూశాడు. మల్లన్న మంత్రి అప్పుడు సెలయేటినుంచి నూతివద్దకు ఒక చిన్న కాలవను తవ్వమని భటు లకు ఆజ్ఞాపించాడు. భటులు కొద్ది సేపట్లోనే సెలయేటినుండి నూతి వరకు కాలవను తవ్వేరు.

ఆ కాలవగుండా సెలయేటి నీరు నూతిలోనికి ప్రవహించింది. కొద్ది సేపట్లో నూతిలో నీరు పైకి వచ్చింది. నూతి లోపల అంతవరకు యీదు తున్న భటుడు నీటి మట్టంతోపాటు పైకి వచ్చాడు. నూతి నీరు భూమితో సమానంగా రాగానే భటుడు తలపాగ పట్టుకొని గట్టు యెక్కేడు.

తరువాత ఆ కాలవను పూడ్చి వేసి మల్లన్న మంత్రి, రాజు, భటులు పట్టణంవైపు బయల్దేరారు. రాజు మల్లన్న మంత్రి సమయస్ఫూర్తిని మెచ్చుకొన్నాడు.



# జడ్జిగారి డైరీలోంచి

కన్నడమూలం: హెచ్. ఎస్. పార్వతి

అనువాదం: శర్వాణి



జడ్జి :—

నా ఇన్నేళ్ళ అనుభవంలోనూ ఎప్పుడూ ఇలాటి చిత్రమైన కేసు తటస్థపడినట్టు గుర్తులేదు. క్రిమినల్ కోర్టుకు వచ్చినప్పటినుండి ఎన్నో ఖూనీ కేసులు వచ్చాయి. విచిత్రమైనవి, భయంకరమైనవి, ఊహించటానికి కూడా వీల్లేనివి అవి. ఆ నేరస్థులూ అంతే. చిత్రవిచిత్రమైన స్వభావాలు కలవారు. కేవలం డబ్బుకోసం ఎదుటివారి గొంతుకోసే వారిదగ్గరినుండి, ఖూనీ చెయ్యాలన్న ఉద్దేశ్యంతోనే కొన్నేళ్ళు అన్ని సమకూర్చుకొని ఆఖరికి తమ కోర్కె నెరవేర్చుకున్నవారిదాకా భిన్నమైన తరహాలవారున్నారు. ఒక పాపాన్ని దాచటానికోసం మరో పాపం చేసే వ్యభిచారిణీలు ఇష్టంలేని భర్తతో కాపురం చెయ్యలేక, విడిచివెళ్ళేదారిలేక నిద్రపోతున్న భర్త నెత్తిన బండరాయి పడేసి చంపిన వనితలూ, తమకు లేని భాగ్యాన్ని మరొకరు అనుభవించటాన్ని చూసి సహించలేక అసూయతో మందో మాకో పెట్టేవారు— ఇలా నానా రీతుల్లో చేసిన తప్పులను దాచలేక న్యాయదేవత ముందు నుంచుని బలి పశువులైపోయారు వీరంతా.

మనిషి కోపానికి వశమైనప్పుడు ద్వేషానికి మనస్సులో తావిచ్చినప్పుడు పశువుకన్న హీనమైపోతాడన్నదానికి సాక్షులు వీరంతా. పైపైన ఎంతటి నిరపరాధులమన్న ముసుగు కప్పుకున్నా, వాళ్ళ మొహాలమీద ముద్ర వేసినట్టు కనిపిస్తున్న క్రూరత్వపు ఛాయలు వీరు నేరస్థులని పట్టిస్తూండేవి. కొంచం కూడా ఆనవాళ్ళు లేకుండా నేరాలు చేసేవారు కొందరు. వీళ్ళల్లో 'ఎంతమంది న్యాయదేవత ముష్టినుండి తప్పించుకొని నాగరిక సమాజంలో సభ్యులుగా చలామణి అవుతున్నారో మరి! లేక, ఎవరికెరుక? మనసులో ద్వేషమూ క్రోధమూ నాట్యం చేస్తున్నప్పుడు, అవి వివేకాన్ని మరచి నృత్యం చేసేటప్పుడు, పిరికితనాన్ని వెనక్కి నెట్టివేసి ధైర్యాన్ని పుంజుకున్నప్పుడు తాను ద్వేషిస్తున్న మనిషి ఎదుటపడితే ప్రతివాడూ అతన్ని స్వాహా చెయ్యటానికి సిద్ధపడవచ్చు తనలాగే, ఇంకొకడూ బ్రతకాలన్న ఉదారతకన్న చట్టానికి భయపడే మనలో చాలామంది 'మంచి' వారుగా ఉంటున్నారేమో!

కాని ఈ సారి నేరస్థుల స్థానంలో

నుంచుంది ఓ స్త్రీ... అందమైన సుశిక్షితురాలైన యువతి విరిసిన కమల పుష్పంలో నైనా కళంకపు ఛాయలను గుర్తించవచ్చునేమోగానీ, ఆమె మోహంలో అనుమానాస్పదమైన భావం కించిత్తూ కానరావటం లేదు. చూడగానే ఓ విధమైన గౌరవ భావాన్ని కల్గించే ఆ తరుణి ఇంతటి దారుణ కృత్యాన్ని చేసి ఉండవచ్చునన్న ఊహను మనస్సులోకి రానివ్వటానికి కూడా నేనంగీకరించలేక పోయాను. ఆమెను బోనులో నిలబెట్టిన పోలీసుల మీదే కోపం రాసాగింది.

ఆ కేసు వివరాలివి. ఖూని చెయ్యబడిన వ్యక్తి ఆ వూళ్ళోని ఓ సంగీతకారుడు. పేరు భాస్కరయ్య. సంగీత పాఠాలు చెప్పుకుని బ్రతికే సామాన్య అంతస్తుకు చెందిన వ్యక్తి. కళాకారుడనటానికన్నా సంగీతం మేష్టారుగానే పిలవబడుతూ రోజులు గడుపుతున్న వ్యక్తి. చూట్టానికి పెద్ద వ్యక్తిత్వం ఉన్నవాడుగా కనిపించడు. కొన్ని రోజుల క్రిందట అతను ఆస్పత్రిలో చనిపోయాడు. విష సేవనవల్ల మరణించాడని డాక్టర్లు అభిప్రాయపడ్డారు. చనిపోయే ముందు అతను చెప్పిన ఒక్కమాట వల్ల ఆమె ఇప్పుడు నేరస్థుల స్థానంలో నిలబడాల్సి వచ్చింది. ఆమె ఆ వూళ్ళో ఆగర్భ శ్రీమంతులైన కె. ఎస్. బాలకృష్ణ గారి ధర్మపత్ని. ఆమె పేరు కుముదా... ఆమెకు సంగీతం నేర్పే వాడే మాష్టారు. రోజూ వాళ్ళింటికి వెళ్ళి వస్తూండేవాడు. ఆ రోజు కూడా వెళ్ళి కాఫీ ఫలహారం సేవించి వచ్చాడు. ఇంటికి వచ్చిన కాస్సేపట్లో పెద్దగా కడుపు నొప్పి వచ్చింది. ఇంట్లోవాళ్ళు భయపడి ఆస్పత్రికి తీసికెళ్ళారు. క్షణ, క్షణానికి నొప్పి ఎక్కువ కాసాగింది. ఏ మందూ, ఇంజక్షనూ అతని నొప్పిని తగ్గించలేక పోయింది. డాక్టర్ని చూసి రోగి అరిచాడు.

'దీనివల్ల లాభంలేదు డాక్టర్ పిశాచి నాకు విషం పెట్టింది. ఆ విషం పొయ్యే మందివ్వండి. ఆ పాపి నన్ను చంపేసింది...'

'ఎవరు? ఎవరు?'

'ఆదే కుముదా... కుముదా...'

సంగీతకారుడు చనిపోయాడు పోస్టుమార్టం చేసి చూసినప్పుడు అతని మాటలోని నిజం బయటపడింది. చనిపోయే సమయంలో ఎవరూ అబద్ధాలు చెప్పరన్న విశ్వాసం వల్ల అతని మాటకు ఎక్కడలేని విలువా వచ్చిపడింది. కుముద అపరాధిని అనిపించుకుంది. పెద్దింటి కోడలు జైలులో ఉండటమా? వెంటనే భర్త జామీనిచ్చి ఆమెను విడిపించాడు. నీళ్ళలా డబ్బు ఖర్చు పెట్టటానికి తయారయ్యాడు. లెక్కలేనంత మంది సాక్షులను పిలిపించాడు.

ఇంట్లో పనివారంతా సాక్ష్యం చెప్పారు. ఎవరెంత చెప్పినా న్యాయపు త్రాసు పోలీసువాళ్ళవేపే మొగ్గుతోంది ఇక ఆమె! ఈ గొడవవల్ల ఆమె మొహం కాస్త వాడినట్టున్నా, భావరహితమైన శిలా మూర్తిలా నిశ్చలంగా అగుపిస్తోంది ఏ ప్రశ్న అడిగినా 'ఊఁ ఊఁహూ' అనటం తప్పితే మరోమాట రావటం లేదు ఏ నిర్ణయానికి రాలేక నా మనస్సు అస్తవ్యస్తమైంది.

ఆఖరి రోజున ఆమెనుండి ఓ అర్జీ వచ్చింది - రహస్యంగా తన కేసు విచారించాలని. విచారణ జరిగే సమయంలో తన భర్త కూడా అక్కడుండరాదని కోరుకుంది క్రిమినల్ కేసుల్లో ఇలాటి వాటిని అనుమతించటం కష్టసాధ్యమయినా, అందరి ఎదుటా ఆమె ఏమీ చెప్పదన్న నిర్ణయానికి రావటం వల్ల ఆమె కోరికను అనుమతించాను నిర్ణయించిన రోజున మితపరివారం ఎదుట విచారణ ప్రారంభమయింది

లాయరు ప్రశ్న అడగటానికి ముందే ఆమె చెప్పింది

'నేనతన్ని చంపాను. నేను నేరస్థురాలిని' అని.

నెత్తిన పిడుగులు పడిన చప్పుడొకసారి వినిపించినట్లయింది నాకు మరు క్షణం నాకనిపించింది ఇందులో ఏదో రహస్య ముండాలి ఆమె తన భర్తనో మరెవరో ఆత్మీయులనో కాపాడటానికి నాటకమాడుతోంది నాకివన్నీ అనుభవమే కదా.

నేనడిగాను. 'కారణం?'

'కారణం చెప్పితీరాలా?'

'కారణం లేకుండా ఏ పనీ జరగదు. అపరాధం నిశ్చయించాలంటే కారణాలకే ఎక్కువ ప్రాధాన్యత నివ్వాల్సుంటుంది.'

'చెప్పండి'

'ఆమె తన కథ చెప్పసాగింది భావోద్వేగంతో కాక, నిర్వికారంగా వేరే ఎవరిదో కథ చెప్తున్నట్టు శాంతస్వరంతో చెప్పసాగింది. బహుశ—అప్పుడామె నిండా మునిగిన వాడికి చలేమిటన్న మనస్థితిలో వుందనుకుంటా.

కుముదా: —

అవును నేను నేరస్థురాలిని. హంతకురాలిని. విషం పెట్టి అతన్ని చంపాను. ఎందుకంటే.. అప్పుడు నా ఎదుట ఉన్నదొక్కటేదారి లేదా నేను ఆత్మహత్య చేసుకోవాల్సివచ్చేది. అతన్ని చంపటమే మంచిదనిపించింది నాకు..ఎందుకు?.. మళ్ళీ ఈ 'ఎందుకు?' కు బదులు చెప్పాల్సివస్తే నా జీవితాన్నే మీ ముందు పెట్టాలి తప్పదు.

నేను సాధారణ మధ్యమవర్గపు కుటుంబంలో పుట్టాను మా నాన్న డబ్బు గల వారు కారు. కాని విద్యా ప్రేమి. కనుకనే ఆడ–మగ అన్న భేదం లేకుండా పిల్లలందరికీ వీలయినంతవరకు చదువు చెప్పించారు ఇక నా అందాన్ని గురించి చెప్పక్కరలేదనుకుంటాను ఈ నా రూపసంపదతోనే సామాన్య గృహస్థు కుమార్తె అయివుండి కూడా వూళ్ళోని ఆగర్భ శ్రీమంతుని చేపట్టే భాగ్యం కలిగింది. ఓ! ఆ రోజు సంగతి తలుచుకుంటే ఒళ్ళు పులకరిస్తుంది. తల్లి తండ్రుల కెంత ఆనందం? నన్ను చూసి అసూయపడ్డ వాళ్ళెంతమంది! నేనూ లోలోపలే పొంగిపోయాను. మావారు వొట్టి శ్రీమంతులే కాకుండా రూపవంతులవటం కూడా నా సంతోషానికి కారణమయింది.

ఎంతో సంభ్రమంతో అత్తవారింట్లో అడుగు పెట్టాను కాని కొన్నిరోజుల్లోనే నా కళ్ళకు కప్పిన పొర తొలగింది. ఆ ఇంట్లో నాకున్నది ఉత్సవమూర్తి స్థానమేనన్నది అతి త్వరలోనే తెలుసుకోగలిగాను. ఇష్టం వున్నా లేకపోయినా బొమ్మలాగా ముస్తాబయి మా వారు తీసికెళ్ళినచోటికల్లా వెళ్ళటం, పరిచయం చేసినవాళ్ళతో కరస్పర్శ చేయటం, పెదవులమీద నవ్వు పులుముకోటం. ఇది పెళ్ళయిన కొత్తలో నాకున్న పని. ఇంటి కొచ్చాకా భర్తగారు నన్ను ఆత్మీయంగా మాటాడించలేదు. కొద్ది రోజుల్లో ఈ హడావిడి తగ్గింది. డబ్బుతో మా వారికి బయటే కావల్సిన విలాస సామగ్రి అంతా సమకూరుతుండడంవల్ల, నానుండి ఆయన కొత్తగా కోరుకోవాల్సినదేమీ ఉండేది కాదు. మొత్తంమీద ఇంట్లో నౌకరుకు కొత్త యజమానురాలు దొరికినట్టువుందే కాని నాకు జీవిత సహచరుడు లభించలేదు.

# జడ్జిగారి డైరీలోంచి

ఒకే ఇంట్లో ఉన్నా ఇద్దరం అపరిచితుల్లాగే గడిపేవాళ్ళం. దాంపత్య జీవితం గురించి నేను కన్న కలలన్ని పగటికలలే అయ్యాయి.

రోజులు నిస్సారంగా అతి బరువుగా గడిచేవి. మా పుట్టింటిలో ఇలాంటి ఐశ్వర్యమూ, ఆడంబరమూ లేకపోయినా మమత, వాత్సల్యాలకు కొదవ వుండేది కాదు ఏ మాత్రం ఆత్మీయత లభించని ఈ ఇల్లు స్మశానంలా అనిపించసాగింది ఊపిరి పీల్చుకోటమే కష్టమనిపించి, ఆ పరిస్థితి భరించలేక ఓ రోజు ఎక్కడికో బయల్దేరుతున్న మా వారిని ఆపాను అయన కోపం తోనూ, ఆశ్చర్యంలోనూ నావేపు చూశారు. నా మనసులో ఎన్నో భావాలు పొంగి వచ్చాయి. వాటిని మాటల్లో చెప్పలేక పోయాను అఖరికి,

'మీరు.. వెళ్ళకండి' అన్నాను.

'ఏం?'

'నాకేం తోచటంలేదు.'

'బాగానే వుంది. నీకు తోచదని రోజల్లా నీ ముందు కూచోమంటావా? ఏదైనా క్లబ్బులో చేరు. సినిమాకు వెళ్ళు. స్నేహితులతో కలిసి కబుర్లు చెప్పుకో— అంతేగాని...'

'కాని...'

మరి గొంతుపెగల్లేదు నాకు.

'నీక్కావల్సింది డబ్బేగా తీసుకో ఇష్టమొచ్చినట్టు ఖర్చుపెట్టుకో. ఏమైనా చేయి నా విషయాల్లో మాత్రం కల్పగచేసుకోక,'

అంటూ చెక్‌బుక్ నావేపు విసిరేసి తిరిగి చూడకుండా వెళ్ళిపోయారు అవమానంతో ఉడికిపోయాను. అనాథలా క్రింద పడివున్న చెక్‌బుక్ నన్ను వెక్కిరించినట్టనిపించింది. మొదటిసారిగా ఆయన పట్ల నా మనసులో తిరస్కార భావం జాగృతమయింది. అబ్బా! ఎంత ధిక్కారం? డబ్బు, నగలు, చీరెలతో ఏ స్త్రీనైనా లొంగదీసుకోవచ్చు ననుకుంటున్నారు వీరు? ఆడదానికీ ఓ హృదయం ఉంది ఆ హృదయం మొదట కోరుకునేది ప్రేమను అన్న సంగతి గ్రహించలేని పశుప్రాయులు.. అయ్యో...నా తెలివి తెల్లారినట్టే ఉంది. వాళ్ళకి హృదయముంటేగా మరొకరి హృదయాన్ని గ్రహించటానికి...

ఆ రోజు మా వారిపట్ల నా మనస్సులో జనించిన జుగుప్స, తిరస్కారాలు రోజు రోజుకీ ఎక్కువవ సాగినయి. అడవి గాచిన వెన్నెలలా నా జీవితాన్ని నాశనం చేసిన ఆయన పట్ల నా మనస్సులో ద్వేషం, కసి ■ గులుకొన్నాయి. ఆయనమీద కసి తీర్చుకోవటం ఎలాగో తోచలేదు భర్త వొదిలేసి స్వాతంత్రంగా బ్రతక గలిగే చైతన్యం నాకు లేదు. నేను వెళ్ళిపోయినా మావారికి దానివల్ల ఏ నష్టమూ లేదు కూడా. ఏం చెయ్యాలో తోచక మనసులో చోటుచేసుకున్న ద్వేషమన్న పాము పిల్లకు పాలుపోసి పెంచసాగాను ఎక్కువ రోజులు అలాగే వదిలేస్తే ఆ విషంతో నేనే మాడిపోతానేమోనన్న భీతి నన్నావరించింది.

లోపల రాజుకుంటున్న నిప్పును భరించలేక నేను అల్లల్లాడుతుంటె, దానికి తను నూటిపోటి మాటలతో ఆజ్యంపోసి మరింత ప్రజ్వలింపజేసేవారు మా అత్తగారు... కొడుకుపట్ల గుడ్డి ప్రేమతో మూసుకుపోయిన ఆమె కళ్ళకు, అయనచేసే పనులు కనిపించేవే కావు కనిపించినా అన్నిటికి నేనే కారణమని ఆమె దృఢాభిప్రాయం. నన్ను చూసినప్పుడల్లా మాటలతో హింసించటం అలవాటయిందామెకు

"మొగుణ్ణి చేతిలో పెట్టుకోలేకపోయాకా, ఇక ఎందుకూ ఆడది? అందమెందుకు కాల్చనా? పెళ్ళయి ఇన్నాళ్ళయినా ఓపిల్లా పాపా లేకపోయాక మగవాడు ఇంటిపట్టున ఎలా ఉంటాడు?''

ఆమె మాటల్లో నామనస్సును ఒక్కటి మాత్రం ఎక్కువగా ఆకర్షించసాగింది. అది బిడ్డ...నాకో బాబు కలిగితే...నా బాబు.. నావాడైన బాబు నాకుంటే...వాళ్ళ తిరస్కారం...అనాదరణ అన్నిటిని మరచి బ్రతకొచ్చు ఓ భగవంతుడా నాకోబిడ్డ నివ్వలేవా?...ఆ ఊహే ఎంతో అందంగా కన్పించింది నాకు.

కాని ఈ దాంపత్యం ఇలాగే కొనసాగితే ఆ ఊహలు ఊహల్లాగే ఉండిపోక తప్పదు. నా మాతృత్వానికి గొడ్డలి పెట్టుపెట్టిన నా భర్తపట్ల మళ్ళీ ద్వేషం హృదయంలో భగ్గుమంది. ఆ రోజుల్లో నా మనసులో రెండే ఆలోచనలు. ఒకటి కసి! రెండు

బాబు!

ఆ సమయంలో నా కంటికి సంగీతం మేస్టారు భాస్కరయ్య కనిపించాడు అప్పటికి కొన్నినెలలుగా సంగీతం నేర్చుకుంటున్నాను నేను. బ్రతుకులోనే నిరాశచెందిన నాకు సంగీతంమీద పెద్ద ఆసక్తి లేదు. కాని కాలక్షేపానికదో వ్యాసకం అంతే ఆమేస్టారికి కూడా నాకు పాఠం చెప్పటంలోకన్నా, నావేపు చూడటంలోనే ఎక్కువ ఆసక్తి ఉన్నట్టు కనిపించింది. నలుగురు పిల్లల తండ్రయినా స్త్రీ వ్యామోహం తగ్గినట్టు లేదు. ఇక ఏ విధంగానూ తన కోర్కె నెరవేర్చుకోలేక కళ్ళతోనే తినేసేలా నావేపు చూస్తూ తృప్తిపడేవాడు. మొదట్లో ఆ చూపులు నాకు జుగుప్స కలిగించినా రానురాను అతన్ని గురించి ఆలోచించటం ప్రారంభించాను. నా తీరని రెండు సమస్యలకూ ఇతడినే ఎందుకు సాధనంగా వాడుకోకూడదనిపించింది. మొదట్లో ఆ ఆలోచనే నాకు అసహ్యమనిపించింది. కాని నాలో తుఫానురేపిన కోర్కె, తల్లి కావాలన్న కాంక్ష, వివేకాన్ని జయించింది. అటూ ఇటూ చూడకుండా కళ్లకు పట్టీలు కట్టుకుని పరిగెత్తే గుర్రంలాగా, నేతరవాతి సంగతి ఆలోచించకుండా, తనకోర్కె నెరవేర్చుకోవటంవేపే పరుగుతీసింది నామనస్సు. తెలిసీ తెలిసీ గోతిలోదిగాను. నాకో సంతానం కలిగాక అతనితో ఇంక ఏవిధా సంబంధం పెట్టుకోనని ముందే మాట తీసుకున్నాను. అతను నా షరతులన్నిటికీ ఒప్పుకున్నాడు. అందమైన ఆడది చేతికి అందుతున్నప్పుడు తెలివిపోనివి ఆలోచిస్తూ కూచునే అవివేకి కాడతను. పైగా నాతెలివి తక్కువను బాగానే ఉపయోగించుకున్నాడు.

ఊఁ...ఇంకా ఏం చెప్పను ? నే ననుకున్నట్టుగా తల్లినయ్యాను. అందమైన ఆడపిల్లను కన్నాను. నా అదృష్టంకొద్దీ పాప కంతా నాపోలికేవచ్చింది. పాప ఆగమనంతో ఇంటివాతావరణమే మారిపోయింది. ముసలి అత్తగారికి నామీద ఎనలేని ఆదరాభిమానాలు ఏర్పడ్డాయి. మావారు నన్ను బాగా చూడసాగారు. నా జీవితానికిక చీకటే అనుకున్న నాకు వెలుగు కనిపించసాగింది. కాని అది వెలుగుకాదు. ఇంటిని దహించే అగ్ని అన్న సంగతి త్వరలోనే తెలిసింది. అగ్నిప్పు నేనేపెట్టాను. అది క్షణ, క్షణానికి

# జడ్జిగారి డైరీలోంచి

వ్యాపిస్తూ పోతోంది. నా నిస్సహాయతను భాస్కరయ్య బాగానే ఉపయోగించుకున్నాడు. అప్పటికీ నేను సంగీతం నేర్చుకోవటం మానేసాను. అయినా అతను మా ఇంటికి రావటం మానలేదు. అతను వచ్చినప్పుడల్లా అతను అడిగినంత డబ్బు ఇచ్చి, ఇచ్చి చాలా అయింది నాకు. కొన్ని నగలుకూడా ఇవ్వాల్సి వచ్చింది. ఏమైనా అతని ఆశకుమాత్రం అంతులేకుండా పోతూనే ఉంది. రాను, రాను, అతనినీడ — చూస్తూనే భయపడేలా తయారయింది నాపరిస్థితి. మనశ్శాంతి కరువయింది. ఏ నిమిషంలో అగ్ని భాండం బద్దలవుతుందోనన్న శంకతో విలవిల్లాడిపోసాగాను. భయం నీడలా నన్ను వెన్నంటింది. నన్నుగురించి కాక నా పాపను గురించినే నెక్కువ బెంగపడసాగాను. ఈ మనిషి ఇలా నన్ను కాల్చుకుపీడిస్తే, అతని బకాసురుడిపొట్ట నింపలేక ఎప్పుడో ఓ రోజు నేను ఓడిపోవటం ఖాయం. అప్పుడు రహస్యం బయట పెడతాడతను. తరువాత నేనూ, నా పాపా ... అనాథుల్లా భిక్షమెత్తుకు తినాలి...గాని దారి నుండి తప్పించుకోటానికి మార్గం ఏమిటి? నా ఇన్ని బాధలకు కారణమైన అతడిని ఇహ లోకం నుండి పంపించేస్తే! ఇప్పటికే ఒక నేరం చేసిన నేను దానికన్నా భయంకరమైన నేరాన్ని చేయటానికి తలపెట్టాను. ఓ చీమను చంపటానిక్కూడా వెనుదీసే నా మృదు హృదయం ఒక మనిషిని చంపటానికే సిద్ధపడింది.

తరవాత జరిగింది మీకు తెలిసినదే. నేనే నేరస్తురాలిని. హంతకురాలిని. హత్యా కారణాన్ని కూడా మీ ముందుంచాను. క్షమా యాచనచేసి బతకాలని లేదు నాకు. ఈ పాపిష్టి బ్రతుకుమీద విసుగేస్తుంది నాకు. ఒక నేరాన్ని కప్పిపుచ్చటానికి మరో నేరం చేస్తూ గడిపే ఈ బ్రతుకు చాలు. నాకు శిక్ష విధించండి ఉరిశిక్ష విధించండి. నన్ను ఈ నరకం నుండి తప్పించండి కాని ...నా పాప...ఏ పాపమూ ఎరుగని నా పసిపాప...ఈ పాపిష్టిదాని కడుపులో పుట్టిన నేరానికి శిక్ష విధించకండి. నా పాపని మంచి వాతావరణంలో పెరగనియ్యండి. తనెలాటి విషమ పరిస్థితిలో జన్మించిందో, తన తల్లి ఎంత హీనకృత్యాలు చేసింది అన్న సంగతి ఆ పసి మనసుకు తెలియనివ్వకండి. ఇదొక్కటే నా ఆఖరి కోర్కె."

జడ్జి:—

ఆమెకు శిక్ష పడింది. ఇది ఆమె మొదటి నేరం కనుక ఐదేళ్ల కఠిన శిక్ష విధింపబడింది. కాని ఆమె జైలు నుండి బ్రతికి బయటపడుతుందన్న నమ్మకం నాకేం లేదు ఈ కేసు జరిగి ఎంతో కాలమయినా అప్పుడప్పుడూ ఆ జ్ఞాపకాలు నన్ను బాధిస్తూనే ఉంటాయి. కుముద సుందరమైన మోహం నా కళ్లముందు మెదులుతూనే ఉంటుంది. ఆమె చెప్పుకున్నట్టుగా ఆమె హంతకురాలు. అపరాధిని. దానికి న్యాయం దృష్టిలో తగిన శిక్ష లభించింది. కాని సుశిక్షితురాలైన, నిర్మల హృదయపు స్త్రీని అలాటి నీచకృత్యానికి ప్రేరేపింపబడిన ఈ పరిస్థితికి పరిహారమేమిటి? పెళ్ళాడిన భార్యను ప్రేమతో చూడని బాలకృష్ణ నిరపరాధా? అతృప్తికి దాసురాలై తనను నమ్మిన ఆడదాని అసహాయతను దురుపయోగం చేసుకున్న భాస్కరయ్య.. ఇలాటి వ్యక్తులతో నిండిన సంఘంలో కేవలం ఓ అపరాధికి శిక్ష విధించినంత మాత్రాన సమస్య పరిష్కారమవుతుందా? ఈ ప్రశ్నలెన్నో మార్లు నా మనసులో తలెత్తి నా బుద్ధిని సవాలు చేసింది. చేస్తూనే ఉంది.

సరూ.. వెధవ డాక్టరు...
నిద్ర రాకుండా మాత్రలు
యిమ్మన్నాను.. ఏవిచ్చాడో...,
కానీ.. ఆఁ.. ఆఁ... ఆఁ..



CHO-110 Tel (R)

# నిగనిగలాడే, అందమైన జుట్టు

## టాటావారి సువాసన గల కేస్టర్ హేర్ ఆయిల్

### జుట్టును, రోజంతా చెదరకుండా వుంచును

దువ్వుకొన్న తమ జుట్టును చెదరకుండా వుంచుకుంటారు కాబట్టే వ్యక్తులు అందముగా, ఆకర్షణీయముగా కనబడతారు. మీరు కూడా టాటావారి సువాసన గల కేస్టర్ హేర్ ఆయిల్ వాడండి. దీనిలోని విశేష గుణముల వలన మీ జుట్టు ఆరోగ్యంగా వుండడమే గాక దానికి ప్రత్యేకత గల అందం వస్తుంది. మరియు రోజంతా నిగనిగలాడుతూ వుంటుంది.

క్రొత్త, ఆకర్షణీయమైన సీసా 3 సైజులలో లభిస్తోంది



టాటావారి కేస్టర్ హేర్ ఆయిల్...

నిగనిగలాడే, చెదరని, ఆరోగ్యమైన జుట్టు కొరకు

---

# వారఫలం

**15-12-67 శుక్రవారం మొదలు**
**21-12-67 గురువారం వరకు**

**మేషం:** భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వృత్తిలో అనుకూలవార్తలను వింటారు. స్థిరాస్తి వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. కోర్టు వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. విలాస వస్తువులు కొంటారు.

**వృషభం** వృత్తివ్యాపారాల్లో యిదివరకు యేర్పడిన చికాకులు తొలగిపోతాయి నూతన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి ఉద్యోగంలో గౌరవం బాగ ఉంటుంది సాహసముతో కూడిన వ్యవహారాలు వారాంతంలో లాభించగలవు మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మిధునం:** వారంప్రారంభంలోనే వృత్తి వ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది వృత్తిలో, నూతనావకాశాలు లభిస్తాయి. సాంఘీక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. అధిక వ్యయం జరుగుతుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**కర్కాటకం.** వ్యాపారంలో మీరు యిదివరకుచేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు సంతృప్తికరంగాఉంటాయి వారంమధ్యలో అన్నివ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి మీతాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. బంధుమిత్రులను కలుసుకొంటారు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. అధిక వ్యయం జరుగుతుంది.

**సింహం** వ్యాపారంలో ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి ఉద్యోగంలో అధికారుల ఆదరాభిమానాలను పొందగలరు. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీకృషి రాణిస్తుంది. వారాంతంలో అన్ని వ్యవహారాల్లోనూ చికాకులు యేర్పడతాయి. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కన్య:** ఇదివరకు మీకు ఆందోళనకలిగించిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ప్రయాణంద్వారా కార్యసాధన చేయుగలరు.

స్త్రీలకు:— ఆరోగ్యం భాగా ఉంటుంది. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**తుల:** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం వచ్చే పరిస్థితి యేర్పడుతుంది. సాహసంతోకూడిన వ్యవహారాల్లో జోక్యం చేసికోవడం తగదు. వారం మధ్యలో అనుకూల పరిస్థితి యేర్పడుతుంది వ్యాపారంలో ఆదాయం బాగా ఉంటుంది. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో అధికవ్యయం జరుగుతుంది. సంతోషకరమైన వార్తలను వింటారు.

**వృశ్చికం** ఫలితంమాట యెలాగఉన్నా, ప్రయత్నించిన ప్రతిపనీ సులువుగా నెరవేరుతుంది వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కలుసుకొంటారు. వారం మధ్యలో అన్ని వ్యవహారాల్లోను చికాకులు యేర్పడతాయి. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. ఆందోళన కలుగుతుంది

స్త్రీలకు— ఆరోగ్యం బాగ ఉండదు. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**ధనుస్సు:** ఇతరులమీద ఆధారపడి యేవ్యవహారమూ ప్రారంభించడం కాదు. వృత్తిలో పోటి వారితో పోటీ పెరుగుతుంది. ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. ప్రయాణాలోచనలు చేస్తారు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు.

**మకరం** మీకు మున్ముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధించగలరు. సాహసముతో కూడిన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ప్రయాణాలు శ్రమమీద ఫలిస్తాయి. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది. నూతన విషయాలను తెలుసుకొంటారు

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది పోటీ వారితోమాట పట్టింపులు తగవు.

**కుంభం.** కొన్ని వ్యవహారాల్లో మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది ఆర్థికవ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి వృత్తిలో నూతనావకాశాలు వస్తాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీకృషి రాణిస్తుంది. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు.

స్త్రీలకు—కుటుంబ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. సంతానానికి సౌఖ్యసంతోషాలు లభిస్తాయి.

**మీనం** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరుతాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. స్థిరాస్తి వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి మిత్రుల సహాయం లభిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది బంధుమిత్రులను కలుసుకొంటారు.

—మహేష్



# జీవనరాగం

ఉన్నవ విజయలక్ష్మి

### జరిగిన కథ

ఇద్దరు అన్నయ్యలకి, ఇద్దరు అక్కయ్యలకి ముద్దుల తమ్ముడు నిరంజనం. అందరిలోకి పచ్చగావున్నవాడు అతను. అతనికి భార్య పోవడంతో అత్తగారు సీతమ్మగారిదే యజమాయిషీ. వసంత నిరంజనం కూతురు. ఆమెకి చాల గొప్ప సంబంధం చేయాలని సీతమ్మగారి వాంఛ. అన్నీ సక్రమంగానే జరిగి, వసంత పెళ్ళి అయిపోతుంది నిరంజనం పెద్ద కొడుకు మధు. పట్టభద్రురాలయిన అమ్మాయి సుధతో అతనికి పెళ్ళవుతుంది. సీతమ్మగారికి సుధకి ఆట్టే పడడం లేదు. వసంతని అత్తవారు బాధ పెట్టేస్తున్నారని సీతమ్మగారి ఫిర్యాదు సీతమ్మగారికి జ్వరం వొచ్చి పడకుంటే వసంతా సుధే చేయవలసి వస్తుంది.

## 7

రెండురోజులు గడిచాయి. జ్వరం తగ్గుముఖం పట్టలేదు.

'రాయిలాంటి మనిషిని. ఎప్పుడూ ఏ రోగమూ నా దరిదాపులకి రాలేదు. ఇదేదో అంతానికే వచ్చింది. వసూకి ఓ వుత్తరం వ్రాసి పడేయండి.' అంటూ కళ్ళ నీళ్ళు పెట్టుకోటం మొదలుపెట్టింది.

'అందరికీ అన్ని ఖబుర్లు చెప్పే నువ్వు కూడ ఇలా భయపడతావేమిటి— ఈ కాస్త జ్వరం రేపటికి తగ్గిపోదూ.' అన్నాడు మధు అమ్మమ్మకి బత్తాయిరసం ఇస్తూ.

'ఒరేయ్ ఇంకొకళ్ళ కొచ్చినప్పుడు ఎంత ధైర్యం అయినా చెప్పొచ్చు — వేదాంతం కూడ మాట్లాడొచ్చు— తన దాకా వచ్చినప్పుడు మాత్రం—ఆ ధైర్యం వేదాంతం ఏం పనిచెయ్యవు.' అంది ఆవిడ ఆయాసపడతూ.

మధు తనలో తనే నవ్వుకుని, 'నిజమేలే —నువ్వు కాస్సేపు మాట్లాడకుండా కళ్ళు మూసుకుపడుకుంటే తలనొప్పి తగ్గిపోతుంది.' అన్నాడు.

'నవ్వులాట కాదు అమ్మమ్మ నీ కోసం కలవరిస్తోందని ఓ కార్డు వ్రాసి పడేయి' అందావిడ మనవడి ముఖంలోకి చూసి.

'ఇప్పుడు ఉత్తరం అనవసరం—తను వెళ్ళి పదిహేనురోజులు కూడ కాలేదు— ఈ ఉత్తరం అందగానే మళ్ళీ పరుగెత్తుకు వస్తుంది బాగుండదు.మామూలు జ్వరమేగా' అని తండ్రీ కొడుకులు ఆలోచించుకుని ఉత్తరం వ్రాయలేదు.

మరో మూడురోజులు గడిచినా జ్వరం తగ్గలేదు.

'అమ్మా, అయ్యో' అని మూలుగుతూనే, 'ఉత్తరం అందినా వసూ ఇంకా రాలేదు—వాళ్ళు పంపరు. నాకు తెలుసు. అక్కడ నరకంలో పడేశాం. అమ్మమ్మకి ప్రాణం మీదికి వచ్చిందంటే కూడ చూడటానికి పంపని వాళ్ళెంత రాక్షసులో.' అంటూ మొదలుపెట్టింది.

మరి లాభంలేదని టెలిగ్రాం ఇచ్చాడు మధు అంది అందుకుంటూనే రెక్కలు కట్టుకుని వాలినట్టే దిగింది వసంత

మంచానికి అంటుకుపోయినట్లున్న అమ్మమ్మని చూస్తుంటే ఆ పిల్లకి దుఃఖం ఆగలేదు. పక్కలో కూర్చుని ఆవిడ వళ్ళు నిమురుతూ కళ్ళ నీళ్ళు పెట్టుకుంది ఏం మాట్లాడలేక.

'అసలు చూస్తానో చూడనో అని భయపడిపోయాను. చూశాను. అంతే చాలు— చివరి కెలా పంపించారమ్మా? అక్కడ ఏం గొడవలు జరుగుతున్నాయో నువ్వెంత బాధ పడుతున్నావో అని హడలిపోయాను'

'టెలిగ్రాం అందగానే వచ్చేశాను. ఏన్నాళ్ళో అయినట్టు మాట్లాడతావేమిటి?' అంది వసంత తెల్లబోతూ.

'టెలిగ్రామా? నాలుగురోజుల క్రిందట ఉత్తరం వ్రాయలేదూ,' అంది సీతమ్మగారు ఇంకా విస్తుబోతూ.

'ఊహు లేదు. మధ్యాహ్నమే టెలిగ్రాం అందింది వెంటనే బస్సులో పంపించేశారు— వారు కూడ రావాలనుకున్నారు వీల్లేక పోయింది—'

'అయితే మరిచిపోయారేమోలే, మీ నాన్నకీ అన్నయ్యకీ కూడ చెప్పాను — ఇంతకీ ఆ కలతలు అవి ఏమైనా సర్దుకున్నాయా నా ప్రాణాలన్నీ నీ మీదే వున్నాయి.'

'నీ కింకా దిగులేం అక్కర్లేదు చాలా హాయిగా వున్నాను — చెప్పానుగా మా తోటి కోడలు దసరా వెళ్ళాక వస్తుందని — నే వెళ్ళేసరికి అక్కడే వుందిలే — ఆ పిల్లకి ఎంత టెక్కనుకున్నావు. అన్నిటిలోనూ నా కంటె నాలుగాకులు ఎక్కువే చదివింది — తన ముందు నేనే ఎంతో మెరుగనిపించాను వాళ్ళకి — ఆ విరగబాటు, ఫ్యాషన్లు మాటకి మాట సమాధానం చెప్పటం, ఆ అమ్మాయిని చూస్తేనే ఇంటిల్లిపాదీ హడిలిపోతున్నారనుకో —తల్లిలేక పోబట్టి కాస్త గారంగా పెరిగింది కాని వసంత చాలా నెమ్మదయింది అనుకుంటున్నారు వాళ్ళల్లో వాళ్ళు. నన్ను ఇప్పుడు నెత్తిమీద పెట్టుకుంటున్నారనుకో — చెప్పకేంగాని, వాళ్ళు అంత అభిమానంగా వుంటున్నప్పుడు నేనూ మంచిగానే వుందామని నా పద్ధతులూ కాస్త మార్చుకున్నాలే,' అంది ఆవిడ చెయ్యి తన చెంపకి రాసుకుంటూ.

'నిజమేనా — పోనీలే తల్లీ చల్లని మాట చెప్పావు.' తృప్తిగా వూపిరి పీల్చుకుందావిడ.

'చల్లని మాట విన్నావు ముద్దుల మనవరాల్ని చూశావు. ఇంక నీ జ్వరం తగ్గిపోతుంది.' అన్నాడు మధు.

'నీ నోటి చలవని మళ్ళీ లేచి తిరిగితే ముని మనవల్ని ఎత్తుకోవాలనే వుంది మరి' జ్వర తీవ్రతలో ఎండిపోయిన ఆవిడ పెదవుల మీద చిరునవ్వు తొణికిసలాడింది

అయిదారు రోజుల నుండీ వంటా

వార్తతో అతలాకుతలం అయిపోతున్న సుధ తల దువ్వుకోటానికి తిలకం దిద్దుకోటానికి కూడా శ్రద్ధ లేనట్లు హైరాన పడిపోతూ, మరో మనిషి ఎక్కువయే సరికి ఆ విసురంతా కత్తిపీట మీద చూపిస్తూ కూరబుట్ట ముందుకి లాక్కుంది.

భోజనాలు చేశాక చాలా సేపు మధు వసంత అమ్మమ్మ గదిలో కూర్చుని కబుర్లు చెప్పారు పది గంటలకి ఆవిడకి మందు ఇచ్చి, 'నేనూ ఈ గదిలోనే పడుకుంటాను,' అంటూ అక్కడున్న మరో మంచం మీద పక్క వేసుకుంది వసంత

సీతమ్మగారికి చాలా సేపు నిద్రపట్టలేదు. ఏదో కష్టం సుఖం మాట్లాడుతూనే వుంది. వసంత నిద్రలో పడిపోయి 'ఊ' కొట్టటం మానేశాక,

'నిద్రొయావా, పోనీ పడుకో,' అని తనూ కళ్ళు మూసుకుంది. చాలా సేపటి తరువాత ఎప్పటికో ఆవిడా నిద్రాదేవి ఒడిలో వాలిపోయింది. అయితే ఆ నిద్రాదేవి వూరికే రాలేదు—

'ఈ మనుష్య జాతికి అసలు తృప్తి అనేది లేదు ఓ కోరిక తీరిన తరువాత మరో కొత్త కోరిక పుట్టుకు వస్తూ వుంటుంది. ఈ పిల్లలిద్దరూ పెద్దవాళ్ళయి ఓ యింటి వాళ్ళయిందాకా నయినా నన్ను ఉంచు నారాయణమూర్తి అని రోజూ దేవుడికి దణ్ణం పెట్టుకునే ఈవిడ ఇప్పుడు పిల్ల కడుపున కాయ కాస్తే చూడాలని వుందంటోంది— వసంతకో కొడుకూ సుధకో కూతురూ పుడితే వాళ్ళిద్దరికీ ముడిపెట్టే దాకా ఉండాలని వుందంటుంది — 'ఇలా నేనెన్నాళ్ళు కనిపెట్టుకుంటాను' అని విసుక్కుంటోన్న మృత్యుదేవతతో.

'నిజమే ఎన్నాళ్ళని వాళ్ళమాటలు వింటూ కూర్చుంటావు – ఎవరివని వాళ్ళు చేసుకుపోవాలి మరి. ఇదుగో నే వెడుతున్నాగా నా వెనకాలే వున్నారా,' అని చెప్పి మరీ వచ్చింది.

అందుకే అర్ధరాత్రి ఇల్లంతా గాఢ సుషుప్తిలో మునిగిపోయిన సమయంలో గజ్జె చప్పుడైనా లేకుండా ఆ గదిలో ప్రవేశించిన మృత్యుదేవత మంచులాంటి తన కౌగిలిలోకి మెల్లగా సీతమ్మగారిని తీసుకుంది.

* * *

ఇల్లంతా బావురుమంటోంది—

ఇక్కడ వుంటే ఎన్నాళ్ళకీ మామూలు మనిషి కాదని పదిమందిలో, సరదాగా, తన దగ్గరవుంటే ఆ బెంగ కాస్త మరిచిపోతుందని వాసు తీసుకువెళ్ళిపోయాడు వసంతని.

సుధ ఒక్కతీ మరీ బిక్కుబిక్కుమంటూ కూర్చుంటోంది చీకటి పడుతుందంటేనే ఆ అమ్మాయికి భయంపట్టుకుంది.

మధు సరేసరి. ఎలాగో కాలేజీకి వెళ్ళొస్తున్నాడే కాని అతని మనసు కుదుటపడలేదు. ఇంటికి రావాలంటేనే అతనికి భయం వేస్తోంది.



# జీవనరాగం

నిరంజనానికీ ఆవిడ లేనిలోటు అనేక విషయాలలో కొట్టవచ్చినట్లు కన్పించ సాగింది అస్తమానూ ఆవిడతో మాట్లాడుతూ కూర్చోకపోయినా ఇంట్లో ఆవిడ వుందంటేనే ఎంతో ధైర్యంగా వుండేది.

సీతమ్మగారి మరణం ఆ కుటుంబంలో ఒక భయంకరమైన నిశ్శబ్దాన్ని కలిగించిందనవచ్చు.

ఆ చిరాకుతోపాటు సుధకి వంటపని కూడ ఒక సమస్యగానే తయారయింది. సీతమ్మగారికి జ్వరం వచ్చిన వారం రోజులు ఎలాగో తంటాలుపడినా, ఆవిడ పోవటం నలుగురూ రావటంతో ఎవరో మనిషిని కుదిర్చారు. రోజూ నాలుగురూపాయలు పుచ్చుకుని ఎలాగో అవసరం గడిపి, మరో పెద్ద బేరం రాగానే వెళ్లిపోయాడు అతను.

ఇంట్లో వుండేది ముగ్గురే కదా, నెమ్మదిగా సుధే సర్దుకుపోతుంది అనుకున్నాడు. కాని ఆ సర్దుకుపోవాలనే ధ్యాస ఆ అమ్మాయికి వున్నట్లు లేదు.

కోడలి ఆంతర్యం గ్రహించిన నిరంజనం ఊరంతా గాలించాడు వంటమనిషికోసం. తెలిసిన వాళ్లందరికీ చెప్పివుంచాడు. చివరికి ఎలాగో ఓ మనిషిని సంపాదించి ఓ ఉదయం ఆవిడ్ని వెంట పెట్టుకువచ్చాడు శంకరయ్య.

ఎర్రటి ముతకచీర, తెల్లటి రవిక, చేతులకి పచ్చటి మట్టిగాజులు, మెళ్లో పసుపు తాడు, నుదుట నయాపైసా అంత కుంకుమ బొట్టు. మనిషి చూడటానికి ఫరవాలేదనిపించింది జుట్టు మున్నగా దువ్వుకుని సిగ చుట్టుకుంది తన పేరు కాంతం అని చెప్పింది. తను చాలా కష్టాలలోవున్నానని పొట్ట గడనక ఇలా వచ్చాననీ, ఏదైనా ఆధారం చూపిస్తే బ్రతికినన్నాళ్లు చెప్పుకుంటానని అంది కాంతం.

'ఈ వూరికి కొత్తగా వచ్చానంటున్నారు ఒక్కరే వచ్చారేం. మీ వాళ్లంతా ఎక్కడున్నారు' అని నిరంజనం అడిగినదానికి ఆవిడ చెప్పిన సమాధానం ఇది—

కాంతమ్మ కుటుంబం మొదట్లో కాస్త బాగా బ్రతికిందే మొగుడు ఎక్కడో గుమాస్తాగా పని చేస్తుండేవాడు. అన్నవస్త్రాలకి లోపం వుండేదికాదు. వాళ్లకి ఒక్కడే కొడుకు. కొన్నాళ్లు సంతోషంగా గడిచిన ఆ సంసారంలో విధి రాళ్లు రువ్వింది. ఆ మొగుడు అన్ని దుర్వ్యసనాలకీ దాసుడయాడు. వాటన్నింటికి డబ్బు తగలేస్తుంటే వచ్చిన జీతం ఏ మూలకి చాలేదికాదు. దాంతో ఇంట్లో మరీ గొడవలు. ఇంటి ఖర్చుకి డబ్బు అడిగిన భార్యని చావగొట్టటం, అన్నంలోకి అన్నిరకాల ఆధరవులూ లేవని కోపం తెచ్చుకుని ఆ విస్తరి ఆవిడ మొహాన్ని వేసకొట్టటం లాంటివి చాలాసార్లు జరిగాయి — కొద్దిగానయినా ఆవిడ వంటిమీద వున్న నగన్నటా పట్టుకుపోయి అమ్ముకుని తాగేశాడు. ఎన్ని కష్టాలనయినా ఓర్పుగా సహించింది ఆ ఇల్లాలు. ఎన్నివిధాలో మంచిగా నచ్చచెప్పింది. ఏడ్చింది. పిల్లాడి మొహం చూసి అయినా బుద్ధిగా వుండమని బ్రతిమాలుకుంది. మామూలుగా వున్నప్పుడు, 'ఇంకెప్పుడూ తాగను కాంతం, నీ మీద ఒట్టు.' అని ఖబుర్లు చెప్పే అతను సాయంకాలం కాగానే ఆఫీసునించి తిన్నగా ఆ దుకాణానికే వెళ్లిపోయేవాడు. ఇంక భరించటం ఆవిడ శక్యం కాలేదు. ఈలోగా పిల్లవాడు స్కూలు ఫైనల్ ప్యాసయ్యాడు. టైపుకూడ నేర్చుకున్నాడు. పదిమంది కాళ్లు పట్టుకుని వాడికో చిన్న ఉద్యోగం సంపాదించగలిగింది. ఆ ఆధారం చూసుకుని మొగుడ్ని వదిలి తమ కొడుకు వేరే కాపరం పెట్టారు. ఓ నాలుగేళ్లు బాగానే జరిగింది. కొడుక్కి పెళ్లయింది. కోడలు వచ్చింది వాళ్లిద్దరూ కలిసి తనని ఇంట్లోంచి గెంటేశారు. గెంటటం అంటే అదే అక్కడి అవమానాన్ని సహించలేక తనే వచ్చేసింది నాలుగిళ్లల్లో ఊడిగం చేసుకుని తను బ్రతకగలదు. కాని ఆ వూళ్లో ఒకప్పుడు అందరిలాగే బ్రతికిన తను ఇవాళ ఇలాంటి జీవితం అక్కడ గడపలేక పోయింది.

నిన్ననే ఈ వూరు వచ్చింది. రాగానే ఎదురుగా కనిపించిన పెద్ద మేడలోకి వెళ్లి వంటమనిషి కావాలా అని అడిగింది. వాళ్లు అక్కర్లేదన్నారు — కాని ఆవిడ దుఃఖగాథ అంతా విని మనసు కరిగిన ఇల్లాలు పార్వతమ్మగారు తనకి చేతనయిన సహాయం ఏదయినా చేస్తానంది. నీ కెక్కడయినా పని దొరికేదాకా మా ఇంట్లోనే గుప్పెడు మెతుకులు తిని ఇక్కడే వుండువుగాని అంటూ ఆదరించింది—తరువాత ఆ

# జీవనరాగం

భర్తతో సంప్రతించి శంకరయ్యకి కబురు పంపి తనని అప్పగించింది—

ఆ కథ వింటున్న అందరి మనస్సులు ఏమిటోగా అయిపోయాయి.

'మహా మహా వాళ్ళకే వచ్చాయి కాని రోజులు—ఇక ఈ కాంతమ్మ అనగా ఎంత,' అనుకున్నాడు నిరంజనం.

'తాగుడు, జూదం లాంటి వ్యసనాలకి దాసులయిపోయిన వాళ్ళ సంసారాలు ఎలా అధోగతిపాలవుతాయో ఈవిడ చరిత్ర చెప్తోంది. ఇలాంటి అభాగ్యులు ఈ దేశంలో ఎంతమంది వున్నారో—ఈ మద్యపానాన్ని జూదాన్ని ప్రభుత్వం చట్టరూపంగా నిషేధించిందే కాని వాటిని అరికట్ట లేకపోతోంది. మనిషి మానసికంగా ఎదగాలి. అతనిలో పరివర్తన రావాలి, అంతవరకూ ఏ చట్టమూ బలవంతంగా అతనిని మార్చలేవు,' అనిపించింది మధుకి.

'అన్ని చావుదెబ్బలూ తిని అన్ని బాధలూ పడుతూ అక్కడే వుండకపోతే ఈవిడ ఈ మార్గం ముందే ఎందుకు వెతుక్కోలేదో. అలా నోరు మూసుకుని అణిగిపడే ఆడవాళ్ళుండటం వల్లే మగవాళ్ళ దౌర్జన్యం సాగించగలుగుతున్నారు,' మాటలు పైకే అనబోయి బాగుండదని వూరుకుంది సుధ.

తరువాత విషయాలు మాట్లాడు కోటం కూడ అయింది.

'సరే, అయితే ఈ పూటనించే వండుతాను.' అంటూ సుధ వెంట వంటగదివేపు వెళ్ళిన కాంతమ్మ,

'స్నానంచేసి మడి గట్టుకుంటాను—' అంటూంటే.

'అంత మరీ పెద్దమడి ఇక్కడెవరికీ లేదు. శుభ్రంగా స్నానంచేసి ఆరేసిన చీర కట్టుకుంటే చాలు—నా చీర ఇస్తాలెండి' అని కాస్త పాతబడిన చీర జాకెట్టు తెచ్చి ఇచ్చింది.

ఆ పూటకి ఏమేం చెయ్యాలో చెప్తున్న సుధతో ఈ ఒక్కరోజుకి మీరు కాస్త దగ్గరుండి అన్నీ చూపించారంటే రేపట్నించి నేను చేసేస్తాను. కొత్త చోటు కదూ. పులుసులూ కూరలూ ఎలా కావాలో—' అంది కాంతమ్మ కుంపటి విసురుతూ.

'అలాగే మీరు కూరలు తరుక్కోండి. నేను స్నానం చేసివస్తాను.' అని వెళ్ళిపోయింది సుధ.

'మీకు అభ్యంతరం లేకపోతే ఇక్కడే వుండిపోతాను—వాళ్ళింట్లో పడుకుంటా నంటే పార్వతమ్మగారు ఏమీ అనుకోరుగాని, రోజూ రాత్రి అంతదూరం వెళ్ళాలన్నా, చీకటితో లేచి రావాలన్నా కష్టం.' అంది కాంతమ్మ అన్నం తింటుండగా.

'అభ్యంతరం ఏముంది. మాకూ అదే వీలు తెల్లవారేసరికి కాఫీలు అమరాలి. మీరెప్పుడో వచ్చేదాకా కూర్చోటం మాకూ ఇబ్బందే—సాయంకాలం వెళ్ళి మీ సామాను తెచ్చేసుకోండి ఆ మూలగది ఖాళీగానేవుంది మీరు పడుకుందురు గాని ..'

'సామానేముంది మరో చీరా రవికా వున్నాయి. ఓ బొంతగుడ్డ అవే తెచ్చేసుకుంటాను ఓ చింకి చాప పడేశారంటే ఎక్కడో అక్కడ పడుం వాలుస్తాను' అంది కాంతమ్మ పులుసువడ్డించుకుంటూ.

'దానికేం లెండి — మీరు మాత్రం కాస్త చీకటితో లేవాలి,' చూశారుగా ఇవాళెంత హడావిడయి పోయిందో' తను రేపటినుంచి కరువుదీరా నిద్రపోవచ్చు అనుకుంటూ కాంతమ్మకి బాధ్యత గుర్తు చేసింది సుధ

'అయ్యో రేవనూ — ఇవాళంటే ఆ శంకరయ్య వచ్చి అతని వెంటనే వచ్చేసరికి ఈ వేళయిందిగాని, రోజూ ఇంత సేపెందుకూ — వెలుగొచ్చేదాకా అసలు నాకంటిమీద కునుకేమీ వుండదు. మీరు లేచేసరికే నా పని సగం అయిపోతుంది. మరో రెండు ఆధరవులు కావాలన్నా నిముషాల మీద చేసేసి తొమ్మిది కొట్టేసరికల్లా వడ్డించేస్తాను.'

'మాటలు బాగానే వున్నాయి. పనికూడ శుభ్రంగా చేసిపెడితే బ్రతుకుతాం.' అనుకుంది సుధ.

(ఇంకా వుంది)

# మదరాసులో ఫ్రెంచి సినిమాలు

మాటలు, సంగీతం, నిర్మాణశిల్పం, చిత్రలేఖనం — వీటిలాగానే సినిమా కూడా ఒకరకమయిన 'భాష' అంటారు. తక్కిన భాషలలాగే ఈ భాష కూడా ముందు వాడిన భాష ప్రభావానికి లోనవటమే కాక దాని పోకడలకి ఎదురు తిరుగుతూ ఉంటుంది. 'సర్రియలిజం' వంటి ధోరణులు తెర మీద కూడా కనిపిస్తూ ఉంటాయి.

ఈ మధ్య మదరాసులో చూపించిన ఫ్రెంచి చలనచిత్ర ప్రదర్శనలలో విపరీతమయిన కొత్త పోకడలేమీ కనిపించలేదు. నిర్వాహకులు అటువంటి సినిమాలు ఇక్కడ చూపించే ఏర్పాట్లు చేసి ఉండక పోవచ్చు. (ఎందరో ఎదురు చూసినట్లు ఈ చిత్రాలలో సెక్స్ అంతగా లేదు కూడా.)

ఫ్లాష్‌బాక్ వాడటంలో కాలక్రమం తారుమారు చెయ్యటం తప్ప ఈ సినిమాలలో ప్రత్యేకమయిన కొత్త పోకడ ఏదీ కనిపించలేదు. అంతేకాక, ప్రదర్శన పూర్తి అయ్యేసరికి చూసినవారిలో హాలీవుడ్‌పట్ల గౌరవభావం ఎక్కువ అవుతుంది. కాని, చలనచిత్ర పరిణామంలో కొన్ని వైఖరులని ఈ చిత్రాలు సూచిస్తాయి.

మంచి కామెడీలని తియ్యటం చాలా కష్టం, అని ఈ విలేఖరి అభిప్రాయం. 'లీ సూపిరాన్, లావిద్ షాతో' — ఇవి రెండూ హాస్యరస ప్రధానమయిన చిత్రాలే. మొదటి సినిమాలో చదువులో పడిపోయి ప్రేమని అశ్రద్ధచేసి తర్వాత ఒక ప్రఖ్యాత గాయకురాలి మోజులో పడి చివరికి ఇంటిదగ్గరే ఉన్న అమ్మాయి ఉన్నదని గమనించిన ఒక అబ్బాయి కథని బస్టర్ కీటన్ సినిమాలు గుర్తుకి తెచ్చే పద్ధతిలో తీశాడు దర్శకుడు పియెర్ ఎటెక్స్. కథానాయకుడు కూడా ఇతనే. రెండవ చిత్రం సాహసకరమయినది. ఇందులో ఫ్రెంచి 'రెసిస్టెన్స్' నాయకుడిని హేళన చెయ్యటం గమనించవచ్చు. ప్రేక్షకుడు; కథానాయికకన్నా వయస్సులో కొంచెం పెద్దవాడయిన ఆమె భర్త నాజీ (లేక నాట్‌జీ) అని వాదిస్తాడు, రెసిస్టెన్స్ నాయకుడు నాజీ నాయకుడితో సమానమయిన వెకిలితనం చూపిస్తాడు! దర్శకుడి పేరు (జె. పి.) రాప్పెనో. రెండు కామెడీల లోనూ 'షాడి' హాస్యం బాగా కనిపిస్తుంది. ప్రేక్షకుడి నాగరికత వీటిని చూసి నవ్వటానికి అడ్డు రాదు.

'సీరియస్' సినిమా అన్నిటిలోనూ 'లీ ఫ్యూ ఫోలె' నిండుగా ఉందనిపిస్తుంది. తాగుడు మానటంకోసం ఎలెయిన్ లెరాయ్ అనే అతను ఒక ఆసుపత్రిలో చేరుతాడు. డాక్టరు కుదిరినదన్న తర్వాత బయటికివచ్చి రెండురోజులు శూన్యంగా గడిపి తిరిగి ఆసుపత్రికివచ్చి ఆత్మహత్య చేసుకుంటాడు. ఫోటోగ్రఫీ, సన్నివేశాల కూర్పు ఇందులో చాలా చక్కగా ఉంటాయి. దర్శకుడు లూయిమాలె చాలా పేరు పొందిన వ్యక్తి.

జంతువుల పట్ల క్రౌర్యం చూపించి ప్రేక్షకుని కదిలించటం సబబుగా లేదని తెలుగు దర్శకులు ఒకరు 'ఓ హసార్డ్ బాల్తసార్' గురించి మాట్లాడుతూ అన్నారు. ఇది కొంతదాకా నిజం అనిపించినా ఛాయా చిత్రగ్రహణం విషయంలో, సంగీతం విషయంలో ఈ చిత్రం ప్రత్యేకంగా బాగుందనిపించేట్లు ఉంది; అంతే కాక, ఇందులో బైబిలుకి సంబంధించిన సూచనలు ఉన్నాయనిపిస్తుంది. ఒక కుటుంబంలోని వారి కష్టాలకీ, బాల్తసార్ అనే గాడిద కష్టాలకీ కల 'సమన్వయం' ఇందులో చూపించాడు దర్శకుడు బ్రెస్సాన్. చివరి ఘట్టంలో బాల్తసార్, దొంగల వల్ల దెబ్బ తగిలి గొర్రెల మందలో పడిపోయి ప్రాణం వదులుకోవటం ఎంతో అర్థవంతంగా కనిపిస్తుంది...



'లీ సూపిరాన్'లో ఫ్రాన్స్ ఆర్నెల్

'పిరో లీ ఫూ', 'లగుర్ ఎ పిని' చిత్రాలు రెండూ చురుకుగానే సాగినా మొత్తం మీద దర్శకుడి ఉద్దేశాలని సంతృప్తికరంగా ప్రతిబింబించలేక పోయాయనే అనుమానం చూసే వారికి కలుగుతుంది. మొదట చెప్పిన చిత్రంలో దర్శకుడు గోడార్డ్ బుద్ధిపూర్వకంగా పెట్టిన కృత్రిమ సాధనాలు కొన్ని కనిపిస్తాయి, రెండవ చిత్రంలో ఫ్లాష్‌బాక్ లనీ జరిగే సంఘటనలనీ విచిత్రంగా కలుపుతాడు రెస్నెయ్.

'లప్యూడూస్' విచిత్రమయిన చిత్రం. ఇందులో ఈ విలేఖరికి హిచ్‌కాక్ ప్రభావం కొంత కనిపించింది. జెట్ విమానాలూ, ఆధునిక నగరజీవితమూ, పగటికలలని పోలిన కొన్ని సంఘటనలూ, తుపాకి కాల్పులూ — ఇవన్నీ ఏవిధమయిన 'సస్పెన్స్'లేని సినిమాలో వింతగా కనిపిస్తాయి. ఇది దర్శకుడి (త్రూఫో) ఉద్దేశం ప్రకారమే జరిగి ఉంటుందనే అనుమానం ప్రేక్షకుడికి కలుగకమానదు. అయితే, ఇంత తెలివిగా తీసి సాధించిన ఈ 'కళాఖండం', చదవటం — రాయటం తప్పు అనే పుస్తకంలాగు సంగీతం చెవికి ఇంపుగా ఉండరాదనే సంగీతకారుల సిద్ధాంతాలు కొన్నిటిలాగ, 'కళ' అనే విషయమయి కేవలం ఒక కళాకారుడి సిద్ధాంతాలని అవగాహన చేసుకోవటం కాలం వృథా చెయ్యడమా కాదా, అనే ప్రశ్నని చూపరులలో లేవదీస్తుంది!

'కళ' (ఆర్ట్) క్రమంగా మానవానుభూతికి దూరం అవటానికి కళే తోడ్పడుతుందని, కొంతకాలంకింద ఒక పెద్ద

రచయిత అన్నాడు: ఇది విశ్వాసితోటి నిజం కాదని మన అనుభవమే తెలుపుతూ ఉంది. కాని, ప్రేక్షకు లెటువంటివారో విర్ణ యించుకుని తన చైతన్యాన్ని ప్రతిబింబించే చిత్రాలుతీసి వారికి చూపించటమే దర్శకుల

## ...ఫ్రెంచి సినిమాలు

ఆశయంగా ఉంటే మంచిదని ఈ ప్రేక్షకుడి నమ్మకం!

—ఆర్.

[గమనిక: ఫ్రెంచి ఉచ్చారణను సరిగ్గా సూచించే అక్షరాలు తెలుగు లిపిలో లేవు కాబట్టి అపకరవకలని చదువరులు క్షమించగలరు!

— రచయిత]



'ఆడపడుచు'లో ఎన్ టి రామారావు వాణిశ్రీ.

**చిత్రసమీక్ష**

# ఆడపడుచు

చిత్రాన్ని నిర్మించి ప్రజల్ని రంజింపచెయ్యడమా? ప్రజల మనసెరిగి చిత్రాన్ని నిర్మించడమా? అనేవి చలనచిత్రరంగంలోని రెండు ప్రశ్నలు! సాధారణంగా రెండవ తరహా చిత్రాల్ని నిర్మిస్తూ కృతకృత్యులవుతుంటారు నిర్మాతలు. మొదటిరకం చిత్రాన్ని నిర్మించడానికి కొంత సాహసం కావాలి, సాధనసంపత్తి కావాలి.

సుభాషిణీ ఆర్ట్ పిక్చర్స్‌వారి 'ఆడపడుచు'లో ఈవిధమైన మార్గదర్శకత్వం కన్పిస్తుంది. నిరాడంబరమైన ఒక కుటుంబం ఇతివృత్తాన్ని మనోహరంగా నిర్మించిన నిర్మాత అభినందనీయుడు.

సత్యం శేఖర్ అన్నదమ్ములు. ఇద్దరన్నలకీ ముద్దుల చెల్లెలు శారద. ఆడపడుచుకు పెళ్ళి చేస్తేనేగాని శేఖర్‌కి పెళ్ళి చేయకూడదు, తాను పెళ్ళి చేసుకోకూడదు అనేది సత్యం పట్టుదల. శేఖర్‌ని లలిత, సత్యాన్ని సుశీల పెళ్ళిచేసుకోడానికి సిద్ధంగానేవుంటారు. అలానే డాక్టర్ రమేష్ కూడా శారదని పెళ్ళిచేసుకోడానికి ఇష్టపడతాడు. పెళ్ళికొద్దిరోజులుందనగా శారదకి ప్రమాదవశాన కళ్ళు పోతాయి. ఇది కథకి మలుపు. అక్కడినించి మామూలుగానే చలనచిత్రకష్టాలు ప్రారంభం. శేఖర్ వేరుపడతాడు. అన్నగారు కష్టాలు పడతాడు. అంతా ఆడపడుచుకోసమే! ఒకనాడు పెళ్ళిపీటలమీదనుంచి లేచిపోయిన డాక్టర్ రమేష్ కథకి శిరసావాగ్గ శారదని పెళ్ళిచేసుకుని, ఆమెకి చూపు రప్పించడానికి విదేశాలకి వెళ్ళినప్పుడు గ్రూప్ ఫోటో తో 'శుభం!'

కథలో బిగి వుంది. చిత్రీకరణలో సొగసూ వుంది. కష్టాల్లోవున్న అన్నగారు తమ్ముడిదగ్గిరికి వచ్చినప్పుడు పల్కిన మాటలు ఎబ్బెట్టుగా వున్నాయి. ఇది కేవలం కథని పెంచడానికే అని అనిపిస్తుంది. 'ఆడపడుచును ఆదరించనివాడు ఛస్తేనేం?' అనే మాటలు అసహజంగా వున్నా స్త్రీ జనాదరణ బాగా లభిస్తుంది. శారద డాక్టరుతో ఉత్తరం రాయించడం దర్శకుని ప్రతిభకి మచ్చుతునక.

ఇందులో ఎన్ టి రామారావు ఒక కొత్తతరహా పాత్రని పోషించారు. గ్లామర్ అనే ప్రాకులాటకి చక్కని గుణపాఠం నేర్పారు. క్షమాగుణం, సహనంగల ఆడంబరంలేని సత్యం పాత్రతో ఎన్. టి రామారావు నటన అద్వితీయంగాను, చిత్రానికి శోభాయమానంగాను వుంది. ఆడపడుచు శారదగా చంద్రకళ అందరి సానుభూతినీ చూరగొంటుంది. శేఖర్ పాత్రకి శోభన్‌బాబు మెరుగుపెట్టాడు. లలితగా వాణిశ్రీ చక్కని నటన ప్రదర్శించింది. హరనాథ్ డాక్టర్ రమేష్ పాత్రని ప్రేక్షకుల మనసులో ముద్రించాడు. సహాయంగా పద్మనాభం అందించిన హాస్యం బాగుంది. రేలంగి పాత్రోచితంగా నవ్వించారు. ఇతర ముఖ్యపాత్రలలో కృష్ణకుమారి, గీతాంజలి, చదలవాడ, నాగభూషణం మొదలైనవారు ఉన్నారు.

ముఖ్యంగా చెప్పతగింది సంగీతం. తాతినేని చలపతిరావు సారధ్యంలో పాటలన్నీ మాధుర్యాన్నొలికించాయి. స్క్రీన్‌ప్లే: యల్ వి ప్రసాద్ సంభాషణలు ప్రశస్తంగా మనసు ద్రవింపజేసే అనేక సంఘటనలతో చిత్రాన్ని సరికొత్త పద్ధతిలో నిర్మించిన దర్శకనిర్మాత కె హేమాంబరధరరావుని అభినందిస్తున్నాను. 'ఆడపడుచు' చిత్రం ఆడపడుచులా అందరి ఆదరాభిమానాల్ని చూరగొంటుంది!

— సికరాజా



'సుఖదుఃఖాలు'లో జయలలిత.

ప్ర: మద్రాసు చిత్రాలేమైనా అంగీకరించారా?

జ: ఎ వి ఎం కు రెండు ఒప్పుకున్నాను. ఇంకా చాలమంది 'ప్రెస్' చేస్తున్నారు ఒకటి, రెండు ఒప్పుకోవచ్చు.

ప్ర: 'విజయ' సంస్థ నిర్మించబోవు చిత్రంలో మీరు నటిస్తారని విన్నా? నిజమేనా?

జ: ప్రస్తుతం కాదు ఒక పిక్చర్‌లో చేస్తానని మాటయిచ్చాను.

ప్ర: ఇప్పుడెన్ని చిత్రాల్లో నటిస్తున్నారు?

జ: నేను రాజ్యం పిక్చర్స్‌లో ద్విపాత్రాభినయం చేస్తున్నాను. రవీంద్రా, జగపతి, విజయభట్, మాధవి, ఎ వి ఎం చిత్రాల్లో 'క్లిష్ట' మయిన పాత్రలను నిర్వహిస్తున్నాను.

ప్రసాద్ ఆర్ట్స్ పిక్చర్సు 'బ్రహ్మచారి' ఊటీ షెడ్యూలులో అయిపోయింది. మధు పిక్చర్ పూర్తిచేశాను.

ప్ర: చక్రవర్తి సంస్థ నిర్మాణంలో మీ ఉద్దేశ్యం?

జ: 'బిజినెస్ పర్పసు' కోసం మేము దీన్ని స్థాపించలేదు. తెలుగుచిత్రాల్లో కూడా 'క్వాలిటీ'ని పెంచి, మన 'సత్తా' చూపించేందుకే.

ఇంతలో పి. ఎ. పి నుంచి 'ఫోన్' వచ్చింది 'సాతనూర్' వెళ్ళేందుకు 'రెడీ'గా వుండమని. 'ఎక్స్‌క్యూజ్ మీ, ఔట్‌డోర్‌కు వెళ్ళాలి మళ్ళా కలుస్తాం' అన్నారు.

నేనుకూడా శ్రీ నాగేశ్వరరావుకి థాంక్స్ చెప్పి వచ్చేశాను.

ఇంటర్వ్యూ : శ్రీనివాస్

ఫోటోలు : డి. ఆర్. రావ్ ●



'1968 ఆఖరు వరకూ తీరికే ఉండదు'



'మరి రెండు మూడు పరిశ్రమలు ప్రారంభించాలి'



'తెలుగుచిత్రాల్లో క్వాలిటీ పెంచి మన సత్తా చూపించాలి'



'అసాధ్యుడు'లో కృష్ణ, కె. ఆర్. విజయ, నెల్లూరి కాంతారావు.

# సినిమా

వాసూ స్టూడియోలో అడుగు పెట్టగానే, ద్వారం వద్దనే వున్న ఛాయా చిత్ర నిర్మాత శ్రీరామరాజు గుడ్‌మార్నింగ్, రండి అంటూ లోనికి పిలిచారు.

అవి పేదరాశి పెద్దమ్మయిల్లు. ఆ యింట్లో, తల దాచుకుంటూ వుంటున్నారు కాంతారావు, కాంచనలు. ఆ దేశాన్ని కామపాలకుడు పరిపాలిస్తున్నాడు. కాంచన అపురూప సౌందర్యాన్ని చూచి రాజనాలకు ఆమెను పొందాలని కోరిక పుడుతుంది.

'లాలసా, లాలసా...ఆగు' అంటూ ఆమె వెంట బడ్డాడు. కాంచన వణుకుతూ తోటలోకి పరుగెత్తుతుంది. ఇంతలో కాంతారావు (శ్రీధరుడు) రాజనాలను చూడడం, యిద్దరి మధ్య పెద్ద ఫైటు. డైరెక్టరు హేమాంబరధరరావు కట్ అన్నారు. అప్పుడు సరిగ్గా మధ్యాహ్నం ఒంటిగంట అయింది. భోజనాలకి బ్రేక్ చేసారు. ఈ చిత్రానికి దేవకన్య అని పేరు పెట్టారు. రెండు పాటలను రికార్డు చేసారు. శ్రీ వీటూరి రచన, టి. వి. రాజు సంగీతాన్ని సమకూర్చుతున్నారు.

## 'తెరపై ముద్దులు తేలిక కాదు'

'హల్లో, కాంచనగారూ, బాగున్నారా' అన్నా. 'టేక్ యువర్ సీట్, ప్లీజ్' అన్నదామె. 'తెరపై ముద్దులను ప్రవేశపెడితే, మీరు ఆ దృశ్యాలలో నటిస్తారా?' అని అడిగాను. 'ఇట్ ఈజ్ క్వయిట్ ఇమ్‌పాజిబుల్' అన్నది కాంచన. 'చెప్పడమంత తేలిక కాదండి చెయ్యడం' అన్నది. 'మీ హాబీస్ ఏమిటి?' అని అడిగాను. 'నవలలు చదవడం, తీరిక దొరికితే స్నేహితులతో జీవిత సమస్యలపైన చర్చ జరపడం, మంచి ఇంగ్లీషు సినిమాల్ని చూడడం' అన్నది. ఇప్పుడు కాంచన తెలుగు, తమిళం, హిందీ చిత్రాల్లో బిజీగా పనిచేస్తుంది.

'డిసెంబరులో జెమినీవారి 'ఇహాల రాణియాం' షూటింగు వుంది, తప్పక వస్తారూ కదూ?' అని అడుగుతూ వుండేప్పుడు యింటిదగ్గిర్నుంచి భోజనానికి రమ్మని ఫోను రావడంతో 'వస్తానండి' అని వెళ్ళిపోయింది.

* * *

వాసూ స్టూడియోనుండి వాహినికి వెళ్ళాను. నాల్గవ ఫ్లోర్‌లో మాతాపితరుల్ షూటింగు జరుగుతూవుంది. లోపలికి వెళ్ళాను. అక్కడ శ్రీమతి సావిత్రిని చూచి ఆశ్చర్యపోయాను. అందరూ ఆమెను లావు, లావు అంటూ వచ్చారు. ఆమె దానికి త్వరలో తగ్గి చూపిస్తానంటూ వచ్చింది. మీరు నమ్మండి, నమ్మకపొండి యిప్పుడు ఆమె లావు చాలా తగ్గింది. ఇంకా కొన్ని రోజులుపోతే మామూలు సావిత్రి అయి తీరుతుంది.

# సినిమా డైరీ

● ప్రముఖ దర్శక, నిర్మాత శ్రీధర్ నిర్మిస్తున్న హిందీ చిత్రంలో పద్మశ్రీ శివాజీగణేశన్ రాజేంద్రకుమార్ స్నేహితుడి పాత్రను ధరిస్తారు. తమిళచిత్రంలో శివాజీకి మిత్రుడిగా నటించడానికి రాజేంద్రకుమార్ అంగీకరించారు.

● తమిళంలో విజయవంతంగా నడుస్తున్న "నాన్" చిత్రాన్ని ఆర్. ఆర్. పిక్చర్స్ శ్రీ టి. ఆర్. రామన్న దర్శకత్వంలో హిందీలో నిర్మిస్తారు. ఇందులో నాయిక బబితా.

● పూర్ణా పిక్చర్స్ అధినేత శ్రీ కామరాజుగారి కుమారుడు చిరంజీవి సుంగిరాజుకి మైసూరు ఫర్టిలైజరు కంపెనీ అధ్యక్షులు శ్రీ వేణుగోపాల్‌గారి ద్వితీయ పుత్రిక సౌభాగ్యవతి మైత్రికి నవంబరు 27 వ తేదిన మద్రాసులోని "ఎబోట్ ఎరి"లో వైభవంగా వివాహం జరిగింది.

● ప్రముఖ హిందీ నటి ముంతాజ్ అమెరికన్ యువకుడు మిస్టర్ జార్జిని వివాహమాడ నిశ్చయించింది. ముంతాజ్ బొంబాయినుండి మద్రాసుకు వచ్చేప్పుడు వీరిద్దరిమధ్య ప్రేమ అంకురించింది.

● ప్రఖ్యాత హిందీ సంగీత దర్శకులు శ్రీ రోషన్‌లాల్ గుండెపోటువల్ల నవంబర్ 16 వ తన 47 వ ఏట మరణించారు.

● "ఉపకార్" హిందీ చిత్రాన్ని దక్షిణభారత భాషల్లో నిర్మించే హక్కుల్ని శ్రీ నాగిరెడ్డి కొన్నారు.

● శ్రీ బీంసింగ్ దర్శకత్వంలో "మురడన్ ముత్తు" హిందీ చిత్రంలో నటించేందుకు దిలీప్‌కుమార్, సంయుక్తబానులు అంగీకరించారు.

● "రాం—ఔర్—శ్యాం" చిత్రం తర్వాత శ్రీ తాపి చాణక్యను "మహాదేవి" హిందీ చిత్రానికి దర్శకులుగా శ్రీ బి. రాధాకృష్ణన్ నియమించారు.

శ్రీ చలం యీ సినిమా పరిశ్రమకు కథానాయకుడిగా ప్రవేశించాడు. నిర్మాతలు, దర్శకులు అతనికి కామెడీ పాత్రల నిచ్చారు. ఆ వేషాల్ని బాగా పోషించాడు. ప్రేక్షకుల అభిమానాన్ని సంపాదించాడు. ఇప్పుడు కామెడీ నటుడిగా ముద్ర వేయబడ్డాడు. అంతే కాదు...యిప్పుడు నిర్మాత అయ్యాడు.

'అందరితో పాటు నేనూ'

సరే, వెళ్దాం అని అనుకుంటూవుంటే శ్రీ జగ్గయ్య బెంగాలీ ధోవతి ధరించి, పైన టెరికాటన్ లాల్చీ వేసుకుని, చేతిలో సిగిరెట్టుతో సాక్షాత్కరించారు. నన్ను చూడగానే 'బాగున్నావా?' అని అడిగారు.' మీరు, మీ రాజకీయాలు ఎలా వున్నాయి' అని ప్రశ్నించాను. 'మొన్ననే ఢిల్లీ వెళ్లొచ్చాను. మళ్లీ పైవారం పార్లమెంటుకు వెళ్లిరావాలి' అని సమాధాన మిచ్చారు.

'మీ సినిమా మార్కెట్టు ఎలా వుంది?' అని ప్రశ్నించాను. 'బాగానేవుంది. ఆరు చిత్రాల్లో నటిస్తున్నా అన్నారాయన. 'మీరు హైద్రాబాదుకి మకాం మార్చలేదా?' అని అడిగిన ప్రశ్నకు జగ్గయ్య నవ్వి 'యెందుకు మార్చను, అందరితో పాటేగా నేనూ' అంటూ 'యిప్పటికి అడయారునుండి మాంబళానికి మకాం మారుస్తున్నా'నన్నారు. ఇప్పుడు జగ్గయ్య మాతాఫిలింస్, విజేతా, మహీజా, సురేష్‌గాక మరి రెండు ప్రముఖ సంస్థల్లో నటిస్తున్నట్లు వ్యక్తపర్చారు.

'నిద్రపోయి 20 రోజులైంది!'

మొదటి ఫ్లోర్ బయట నారదవేషంలో శోభన్‌బాబు, తుంబురుడి పాత్రలో వల్లం నరసింహారావు, గరుత్మంతుడి రూపంలో సత్యనారాయణ కన్పడ్డారు. ఈ ముగ్గురు యిలా కన్పడేది వీరాంజనేయ చిత్రంలో.

శోభన్‌బాబు చాలా నీరసంగా కన్పించారు. 'ఏమిటండీ, డల్‌గా వున్నారు' అని అడిగాను. 'యీ మధ్య రాత్రింబవళ్లు పని చేస్తున్నానండీ. నిద్రపోయి 20 రోజులైంది' అన్నారు. ఇటీవల శోభన్‌బాబు నటించిన 'కృష్ణావతారం,' 'ఆడపడుచు,' 'పుణ్యవతి' అతనికి మంచిపేరును తెచ్చిపెట్టినయి. 'కృష్ణావతారం' నారదుడికి 'వీరాంజనేయ' నారదుడికి నటనలో, భావనలో శోభన్ తగిన వైవిధ్యాన్ని చూపిస్తున్నారు.

—శ్రీనివాస్



# తాను తన కొడుకును గ్రామానికి అంతటికీ తొలి ఎలెక్ట్రానిక్స్ ఇంజనీరుగా చేసాడు

—అయితే తాను మాత్రం చదువనూ వ్రాయనూ చేయలేదు



అయితే తాను పొదుపు చేసాడు. చాలా ఏళ్ల క్రితం—బ్యాంక్ ఆఫ్ బరోడాలో సేవింగ్స్ అక్కౌంటు ప్రారంభించాడు తన కొడుకు పెరిగాక—అతనికి చదువు చెప్పించడానికి తగ్గ డబ్బు తనదగ్గర వుంది. ఈ నాడు అతనొక సగర్వి అయిన తండ్రి—అతని కొడుకు ఎలెక్ట్రానిక్స్ యింజనీరంటే గ్రామానికంతటికీ గర్వం.

బ్యాంక్ ఆఫ్ బరోడా—మీ స్వప్నాలను కూడా సార్థకం చేయడంలో మీకు సహాయపడగలదు. నేడే బ్యాంక్ ఆఫ్ బరోడాలో సేవింగ్స్ ఎక్కౌంటు తెరవండి. రూ. 1తో ఎకౌంటు తెరవచ్చు. 4% వడ్డీ దొరుకుతుంది.




సర్వదా—సమృద్ధికి సోపానం

**ది బ్యాంక్ ఆఫ్ బరోడా లిమిటెడ్**

(స్థాపితం 1908) రిజిస్టర్డ్ ఆఫీసు - మాండ్వి, బరోడా
భారతదేశంలో విదేశాలలో 300 కంటె హెచ్చు శాఖలు
"దయచేయండి మీకు సాయపడతాం" అనే కరపత్రం ఉచిత కాపీని కోరండి. మా సేవల గురించి మీకు పూర్తి వివరాలు దొరుకుతాయి.

Shilpi/bob/3-67 Tel

సాహెబ్ ఇంకా నిద్రపోతూనే ఉన్నాడు. ఏమిటి చెయ్యాలా అని ఆలోచిస్తూ ఉండగానే శానో గదిలోకి వచ్చాడు. కొంచెం సందేహిస్తూనే బాబాసాహెబ్‌ని, 'అయ్యగారూ...అయ్యగారూ...' అని పిలిచాడు.

బాబాసాహెబ్ ముఖం చిట్లించి కళ్ళు తెరిచాడు కాని, శానో, 'అమ్మగారు భోజనానికి ఆలస్యం అవుతుందంటున్నారు... కొత్త బాబుగారు కూడా ఉన్నారు...' అనగానే చురుకుగా లేచికూర్చున్నాడు.

దేశ్పాండే ఇంట్లో పనివాళ్ళు 'తమ యజమానికి ఇష్టంలేనిది ఏదయినా చెప్పవలసివచ్చినప్పుడు, 'అమ్మగారు అంటున్నారు' అనే మంత్రాన్ని వాడుతూ ఉండేవారు. శానో మాటలలోని మహిమ వెంటనే కనిపించింది. మరొక గంటసేపు పడుకుందామనుకుంటున్న బాబాసాహెబ్ వెంటనే ఒకసారి ఆవులించి లేచికూర్చున్నాడు.

అతిథిపట్ల తనకన్నా ఎక్కువశ్రద్ధ చూపిస్తున్న ఆడవారి బుద్ధిని పొగడుతూ మంగేష్‌రావ్‌ని భోజనాల గదిలోకి తీసుకువెళ్ళాడు.

'బాబూ, ఇది మా ఇంట్లో ఒక పాత సంప్రదాయం.' అన్నాడు ఇద్దరూ కూర్చుంటూ ఉండగా 'ఆడవాళ్ళని ఇంటి వ్యవహారాలన్నిటిలోనూ కలగచేసుకోనివ్వంగాని వంటింటి పెత్తనం అంతా వారిదే!'

ఈ సాంప్రదాయంలోని మూల సిద్ధాంతాన్ని ఇలా సూత్రీకరించి బాబాసాహెబ్ దానిని గురించి వివరంగా చెప్పకుంటూ పోయాడు. ఇంటికి అతిథి రాగానే ఆడవారు ఏ విధంగా వంటమనిషిని హెచ్చరిస్తారో, తమే, ఎలా వంటఇంట్లో అన్నివిధాలా కలగచేసుకుంటూ ఉంటారో, 'మంచి చెయ్యి ఉన్నవారినే ఎందుకు వడ్డనకి నియమిస్తారో, కుటుంబంలో వారంతా—ఇంటి పెద్దతో సహా—అతిథి సౌకర్యం కోసం ఎట్లా సర్దుకుపోతూ ఉంటారో, ఆడవారు విధించే వంటింటి శాసనాలని ఎలా శిరసావహిస్తారో చెప్పాడు. అసలు ఇంట్లోవారేమిటి, అతిథులు కూడా వంటఇంటి నుంచి వచ్చే ఆజ్ఞని శిరసావహించవలసిందే, అన్నాడు. ఆడవారు అంత సంతోషంగా తయారు చేయించిన, చేసిన వంటకాలని కడుపునిండా తిని తమ కర్తవ్యాన్ని నిర్వహించాలన్నాడు.

మంగేష్‌రావ్ 'సేజ్' సరిగా సేవించలేదని బాబాసాహెబ్‌పై కర్తవ్యాన్ని మరింత

# తామ్రశాసనం

(37వ పేజీ తరువాయి)

నొక్కిచెప్పాడు: ఇప్పుడయినా భోజనం సరిగ్గా చెయ్యాలని హెచ్చరించే ఉద్దేశంతో.

ఇక మంగేష్‌రావ్ సంగతి—ఫలహారమే అంత పుష్టిగా ఉంటే ఈ భోజనం వర్ణనాతీతంగా ఉందనుకున్నాడు.

పెద్ద వెండికంచాలలో అన్నం వడ్డించిన తర్వాత పచ్చళ్ళు, ఊరగాయలు, కూరలు, ఎన్నో రకాలుగా వండిన చేపలు, ఆల్చిప్పలు పెట్టారు. భోజనం జరుగుతూ ఉంటే అన్నంమీద పప్పుకూరలు, కొబ్బరి పాలతో వండిన కూరలు వడ్డించారు. చక్కటి తిరగమాత చేసిన వాటి ఘుమఘుమలతో ఆ గది నిండిపోయింది. భోజనం ముగియటానికి ఇంచుమించు గంట పట్టింది. తింటున్నంతసేపూ బాబాసాహెబ్ మంగేష్‌రావ్‌తో మీ తాత భవానీబాబా పేరు నిలబెట్టాలంటూనే ఉన్నాడు. భవానీబాబా ఎంత బాగా తినేవాడో తనకి తెలునన్నాడు.

పాయసం వడ్డనతో భోజనం అయిపోయిందని తెలుసుకున్న మంగేష్‌రావ్, 'బాబాసాహెబ్‌గారూ, మీ ఆతిథ్యాన్ని వర్ణించే శక్తి నాకులేదు. మీ ఆదరాభిమానాల కేవిధంగా కృతజ్ఞత చెప్పుకోవాలో నాకు తెలియటంలేదు.' అన్నాడు. నిజంగానే బాబాసాహెబ్ ఆదరం మంగేష్‌రావ్‌ని కదిల్చివేసింది. కాని, తను వచ్చినపనిగురించి చెప్పే అవకాశం కూడా కలుగచేసుకోవాలని అతని ఉద్దేశం. 'దేశ్పాండేల కీర్తికి తగినట్లే ఉంది మీరు నాకు చేసిన మర్యాద. నేను దానికి తగను. ఇలా మీ ఇంటిభోజనం చెయ్యగలగటం కేవలం నా అదృష్టం! అయ్యా, నేను మీతో సరితూగే అంతస్తువాడినికాను! బొంబాయిలో గుమాస్తాపని చేసుకుంటూ పొట్ట నింపుకునేవాడిని... నావంటి అతి సామాన్యుడిని గౌరవించటానికి మీరూ, మీ ఇంటివారూ, ఇంత శ్రమకి లోనయ్యారంటే అది నా అదృష్టం! ఈ రోజుని నే నెప్పుడూ మరిచిపోలేను... పాయసం ఎంత మధురంగా ఉంది! చేపకూరలు ఎంత రుచిగా ఉన్నాయి! కొబ్బరి పాలకూర ఎలా ఉందో ఏమి చెప్పను! ఆల్చిప్పలు...'

ఈ పొగడ్తలు బాబాసాహెబ్‌కి రుచించక పోలేదు. మంగేష్‌రావ్ ఆల్చిప్పల సంగతి ఎత్తకపోతే ఆనందంగా వింటూఉండేవాడే, మంగేష్‌రావ్‌కి తను వచ్చిన పనిగురించి చెప్పే అవకాశమూ ఉండేది. కాని 'ఆల్చిప్పలు' అన్న పదం వినగానే, 'ఆహా, ఆల్చిప్పలేనా 'భలేఉన్నాయి కదూ! వాటిని గురించి చెపుతా వినండి!' అన్నాడు మెరిసే కళ్ళతో. 'ఇవాళ మనం తిన్న ఆల్చిప్పలు మామూలు చేపలబజారులో దొరికేవి కావు! అది మన సొంత చెరువులోనివి...అసలు



అమెరికన్ విమెన్స్‌క్లబ్, మద్రాసు అధ్యక్షురాలు శ్రీమతి ఎడ్డీ డీగ్ ఫీల్డ్ మద్రాసులోని బాలవిహార్‌కి బహూకరిస్తున్న చెక్కుని అందుకుంటున్న రాష్ట్ర హరిజన సంక్షేమశాఖామాత్యులు శ్రీమతి సత్యవాణీముత్తు. మద్రాసులోని అమెరికన్ కాన్సల్ జనరల్ సతీమణి శ్రీమతి అల్బర్ట్ ఫ్రాంక్లిన్. శ్రీమతి మేరీ క్లబ్ వాలాజాదవ్‌లనుకూడా ఫొటోలో చూడవచ్చు.

# తామ్రశాసనం

డెబ్భయ్యేళ్ళుగా 'దేష్పాండేల అల్పిప్పలు' ఈ ప్రాంతంలో ఎంత ప్రసిద్ధి కెక్కాయో తెలుసా? ఎందుకో తెలుసా? ఎందుకంటే, వాటి రుచే అంత, అవి అంత పుష్టికరమయినవీను!'

'పక్కగదిలో కూచుందాము రండి! సావకాశంగా మీకీ అల్ఫిప్పల సంగతి చెప్తాను.' అంటూ లేచాడు బాబాసాహేబ్.

మంగేష్‌రావ్‌కి బాగా చిరాకువేసింది ఈయన మరొక కథచెప్పి ఇంకా ఆలస్యం చేస్తాడు కదా, అనుకున్నాడు. పక్కగదిలో బల్లమీద కనిపించిన లేతజీడిపప్పు, మామిడి ముక్కలు, సన్నటి అరటి వడియాలు చక్కెర పాకం పట్టిన నువ్వుగింజల పళ్ళీలు ఈ చిరాకుని మరింత అధికం చేశాయి.

బాబా సాహేబ్ తన అతిథిని తినమని ఆహ్వానించాడు. మామిడి ముక్కలు నములుతూ అల్ఫిప్పలకథ ప్రారంభించాడు.

మంగేష్‌రావ్ నిస్పృహతో సోఫాలో వెరగిల పడ్డాడు.

'అరె! మర్చేపోయాను సుమా...' బాబా సాహెబ్ సోఫా చేతిని బలంగా గుద్దాడు. ఇంతసేపూ అసలు విషయం తను చెప్పనే లేదుట. అది కేవలం ఉపోద్ఘాతమేనట. ఇప్పుడు అసలు సంగతేమిటో చెప్పపోతున్నాడుట.

'సెన్హోర్ అంతోనియో యురాలియాహ లామర్తిన్హోద సొంతోస్ వాలంతె పేరు విన్నారా? ముందు తరంలో గోవాలో ఈ పేరు విననివారెవరు? ప్రతివారి నోటా ఆయన పేరే! సరే, నలభయ్యేళ్ళుగా మా ఇంట్లో ఈ పోర్చుగీస్ ప్రభువు రాసిన ఉత్తరం ఒకటి ఉంది—ఆయన మంత్రివర్గ కార్యదర్శి తెలుసా? సెన్హోర్ అంతోనియో సొంతోస్ వాలంతెకీ మా నాన్నగారికీ మంచి స్నేహం. అతను ఆరడుగుల మనిషి కాని గోవాలో క్షయ అంటుకుంది. గోవాలో డాక్టర్లంతా అది నయం కాదన్నారు. బొంబాయి వెళ్ళినా అంతే నన్నారు. అప్పుడు పాపం ఆయనకి అభయం ఇచ్చిన మనిషెవరు? ఎవరో కాదు. దేష్పాండేలలో పెద్ద, మా నాన్నగారే! మీరేం భయపడొద్దని ప్రతిరోజా కార్యదర్శికి, ప్రత్యేకం దీనికోసం పెట్టిన మనిషిద్వారా ఈ అల్ఫిప్పలు పంపేవారు. నమ్మండి, నమ్మకపొండి! ఆరునెలల్లో సెన్హోర్ సొంతోస్ వాలంతె మామూలు మనిషయి యురోపియన్ క్లబ్బులో రాత్రంతా డాన్సు చేశాడు! లిస్బన్‌కి రిటరయి వెళ్ళిపోయిన తర్వాత అక్కడినుంచి చక్కటి ఉత్తరం ఒకటి రాశాడు...అందులో, మా నాన్నని 'కారో అమిగో సెన్హోర్ దేష్పాండె' అంటూ, 'మీరు దయతో ఇప్పించిన ఆ దివ్యమయిన అల్ఫిప్పలే లేకపోతే నా జీవితశేషాన్ని స్వదేశంలో గడిపే అవకాశం కలిగేది కాదని కృతజ్ఞతతో, హృదయపూర్వకంగా మనవి చేసుకుంటున్నాను' అన్నాడు!'

బాబా సాహెబ్ ఉత్తరంలోని పోర్చుగీస్ వాక్యాలని ఆ భాషలోనే చెప్పాడు. నాగరికంగా ఉన్న అతని ఉచ్చారణ విని మంగేష్‌రావ్ ఆశ్చర్యపోయాడు. కొంచెం నవ్వుకున్నాడు.

'ఇంకా, 'మీ వాత్సల్యం వల్లనేకదా—దానికినా 'సౌదాదెస్! ఈనాడు నేను ఇక్కడ తేజోనది తీరం మీదనే ఉన్న మా పూర్వీకుల 'షాతో'లోని ద్రాక్షతోటలో, ఈ 'పోర్తో' సేవిస్తూ, నా చిన్నకుమార్తె దోనా బెన్విందా గిటార్ సంగీతం వింటూ, నన్ను అనుకుని ఉన్న నా సతీమణి సెన్హోరా ఇసబెల్లా మార్గరిదా దమెనిజెస్—ఇ—సొంతూష—వాలంతె పక్కనే ఈ కుర్చీలో కూర్చుని ఈవిధంగా విశ్రాంతి తీసుకోన గలుగుతున్నాను,' అని రాశాడు!'

సగర్వంగా, సంతోషంగా బాబాసాహెబ్ సెన్హోర్ సొంతోస్ వాలంతె ఉత్తరంలోని ఈ పంక్తులని చెప్పచెప్పూ ఉండగా గుడి వద్దనుంచి డోలు శబ్దాలు వినిపించటం ప్రారంభించాయి.

అవి విన్న బాబాసాహెబ్ తన కథనం ఆపి, ఆలయంవైపు తిరిగి తలవంచి కళ్ళు మూసుకుని మంత్రాలేవో అస్పష్టంగా చదివాడు. అక్కడ రోజూ జరిగే పూజవేళ బాబాసాహెబ్‌కి ఇలా మంత్రోచ్చారణ చెయ్యటం అలవాటు.

(ఇంకా ఉంది)


**Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press: 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.**

Regd. No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA

లలితా శివజ్యోతి తప్పక చూడండి

# రహస్యం

ఈస్ట్‌మన్ కలర్

నిర్మాత: ఎ. శంకరరెడ్డి M.A.B.L

దర్శకుడు: వేదాంతం రాఘవయ్య



వాణీ రిలీజ్